ముఖచిత్రము :

చందమామ వారి 'సిపాయికూతురు' చిత్రంలో విజయలక్ష్మి

# గృహలక్ష్మి

జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతీయా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు:
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్:
సి. సి. పున్నయ్య

## వ్యక్తి స్వాతంత్ర్యానికి పరిమితులు

వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మానవస్వభావమునకు మూలాధారములు అయితే ఏవ్యక్తి ఏకాకిగా యితరులతో ప్రమేయంలేకుండా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్నా సుఖంగా జీవయాత్ర చేయలేడు. కాబట్టి మానవుడు సంఘజీవియైనాడు. అంటే వ్యక్తిగతంగా మానవుడు స్వీయసౌభాగ్యములను సంఘ శ్రేయస్సుకు, సౌభాగ్యమున కనుగుణంగా తీర్చిదిద్దుకోవాలి. ఆ సందర్భమున వ్యక్తిస్వాతంత్ర్య స్వేచ్ఛలు పరిమితంకాక తప్పవు. అలా పరిమితంకావడం తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు భంగకరమని భావిస్తే ఉమ్మడి శ్రేయో సౌభాగ్యములను విస్మరించినట్లే కాగలదు.

వ్యక్తిగత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పరిమితులనేవి సంఘంలో అన్నిరంగాలలోను తప్పనిసరికాగలవు. వ్యవసాయం, వర్తక వ్యాపారాలు, రాజకీయాలు అన్నియీపరిమితులకు లోబడవలసినవే. వ్యవసాయంచేసి ఉత్పత్తిచేసేవాడు కర్షకుడైనా పరిసరవాతావరణము ననుసరించి తనలాభాలను పరిమితం చేసికొని ప్రజలకు సరసమైన ధరలకు ఆహారధాన్యాలు అందుబాటులోకివ్వాలి. వ్యాపారంలోనైనా సామాన్యప్రజల

స్థితిగతులననుసరించి కనీసలాభాలకు సరకులను విడుదలచేయాలి. అలాగే రాజకీయ రంగంలో సయితము దేశీయ శాంతి భద్రతలను, సౌభాగ్యమును ఉద్దేశించి వ్యక్తి స్వాతంత్ర్యాన్ని మానవుడు పరిమితంచేసికోవాలి. అప్పుడేగాని సహజీవనం సుగమంకా జాలదు.

మానవుడు క్రమశిక్షణారహితంగా స్వార్థానికి, అధికార ఆధిపత్యముల కలవాటుపడి స్వేచ్ఛాస్వాతంత్ర్యములను పరిమితంచేసికొనకపోయినచో నాలుగుమూలల అశాంతి, అరాజకము, అసంతృప్తి ఏవగింపు, తాండవిస్తవి. వానితో సంఘం అభివృద్ధి అభ్యుదయాలను సాధించలేదుసరిగదా మునుగడకే ముప్పమురాగలదు. యావత్ప్రజానీకపు సుఖసౌభాగ్యాలనుద్దేశించి మానవుడు వ్యక్తిగతంగా త్యాగం, సేవలకు అలవాటు పడటం క్షేమకరం.

ఉమ్మడి శ్రేయస్సును, అవకాశములను నిర్లక్ష్యంచేసి స్వార్థమునుద్దేశించి వ్యక్తిస్వాతంత్ర్య స్వేచ్ఛలకు ప్రాకులాడినా తాత్కాలికంగా కొన్ని ప్రయోజనాలు సిద్ధించవచ్చునేకాని అవి శాశ్వతమైన సహజీవనాన్ని ప్రోత్సహించునవి కాజాలవు.

# సహకార వ్యవసాయం

శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ లాంటి ప్రముఖులు జాతీయాదాయంలో హెచ్చుతగ్గులు సమసిపోవాలని సూచిస్తున్నారు. ప్రపంచములో అసంతృప్తి, అశాంతి సమసిపోవాలంటే ఆదాయంలోనేకాదు కలిమిలేముల మధ్యగల తారతమ్యము సమసిపోవాలి. ఇది దేశకాలపాత్రల ననుసరించి క్రమంగా సాధ్యము కాగల సూచనలు కనుపిస్తున్నా అట్టి మార్పును సహించలేక ఆరాటపడుతున్న శక్తులు సయితము ప్రపంచములో ఉండనేయున్నవి.

సహకార సేద్యాన్ని గురించి తర్జనభర్జనలు విరివిగా జరుగుతున్న యీరోజుల్లో దాని కనుకూల, ప్రతికూలశక్తులు రెండూ ప్రజలను ముఖ్యంగా రైతాంగమును ఉద్ధరించడానికనే తాపత్రయపడుతున్నట్లు వ్యవహరిస్తున్నవి.

భూమిని నమ్ముకొని వ్యవసాయమునే జీవనముగాగల రైతాంగమునకు ప్రాతినిధ్యము వహించి, వారికి భూవసతి ఏర్పడి నలుగురితోబాటు సుఖసౌభాగ్యములను భవించాలనుకొనే ఏపార్టీకాని, ఏనాయకుడుకాని సహకార వ్యవసాయమును వ్యతిరేకించడు. వందలు, వేలు యకరాలభూమి సేద్యాని కనువైనదయినా అనేకమంది భూస్వాములు దానిని ఫలప్రదంగా సాగుచేయించక బీడుగానున్న నిదర్శనాలున్నవి. లేదా కష్టించి సేద్యముచేసిన వ్యవసాయ కూలీలకు, సన్నకారు రైతులకు తృప్తికరమైన ప్రతిఫలములేక ఉత్పత్తులు తృప్తికరముగాలేవు.

సహకార వ్యవసాయంయొక్క ముఖ్యోద్దేశము దేశంలోని సాగుకు అనువైన

(324 వ-పేజి చూడుడు)

# డబ్బు ఇస్తే కావలసిన సరుకు ఇచ్చి మిగతా చిల్లర ఇచ్చే యంత్రాలు

అమెరికన్ ఆర్థిక వ్యవస్థలో చిల్లర వర్తకం (రిటెయిల్ వ్యాపారం) శీఘ్రగతిని వృద్ధిచెందుతున్నది. కానీ ఇంతవరకు దీనిలో యంత్రాల ఉపయోగం ప్రారంభం కాలేదు. అయితే ఇప్పుడిప్పుడే ఈ యంత్రీకరణ కార్మికుల ఉద్యోగ భద్రత పైకి నీడవలె ప్రాకుతున్న 'వెండింగ్ మెషిన' (యంత్రి విక్రేతలు) వల్ల ఆటోమాటిక్ విక్రయ విధానంలో క్రొత్త క్రొత్త మార్పులు బయలుదేరుతున్నవి.

చిల్లర వర్తకంలో సాలుకు 200 కోట్ల డాలర్ల వస్తువుల అమ్మకం జరుగుతున్నప్పటికీ గతంలో వెండింగ్ మెషిన్ల (బట్వాడా యంత్రాలు) అభివృద్ధి జరగలేదు. నాణాలుతప్ప తలిమ్మా రూపాయలలో డబ్బు పుచ్చుకొనే అవకాశం యంత్రాలలో లేకపోవటమే ఇందుకు కారణం. ఇప్పుడు బిల్లుమార్చే యంత్రాలు తయారైనవి. దీనితో, యంత్రాలద్వారా వస్తువుల అమ్మకానికి నూతన అవకాశాలు కనుపిస్తున్నవి.

నేషనల్ ఆటోమాటిక్ మర్చెండైజర్స్ అసోసియేషన్ శీతాకాలపు సమావేశంలో ఒక యంత్రం ప్రదర్శింపబడింది. ఈ యంత్రం 30 రకాలదాకా రైలు, బస్సు టిక్కెట్లు అమ్మగలదు. మరొక మల్టీ ప్రోడక్ట్ మిషీన్ కూడా ప్రదర్శింపబడింది. ఒక డాలరు బిల్లును ఈ యంత్రానికి అందించినట్లయితే, తిరిగి రావలసిన చిల్లరతో పాటు ఎనిమిది కిరాణా వస్తువులలో దేన్నయినా ఒకదాన్ని మన చేతికి అందిస్తుంది.

"ఆర్కిటెక్చరల్ ఫోరమ్" అనే ఒక ప్రముఖ వాణిజ్య పత్రికలో ఇటీవల ప్రచురించబడిన ఒక వ్యాసంలో భవిష్యత్తులో చిల్లర వర్తకంపై ఈ యంత్రాల ప్రభావమేమిటో జోస్యం చెప్పటం జరిగింది. బిల్లు ఛేంజింగ్ మిషన్ వర్తక రంగాన్ని పూర్తిగా స్వయం సహాయస్థితిలో పెట్టగలదని చెబుతూ "పూర్తి యంత్రీకరణ ద్వారా సాంప్రదాయిక అంగళ్ల విధానంలో తీవ్ర మార్పులు" కలుగవచ్చునని ఆ వ్యాసంలో ఉటంకించబడింది.

లంగోటాలు, మేజోళ్లు, అండర్ వేర్లు వంటివి స్టేపుల్సు కాండీలువంటి చిన్న వస్తువుల బట్వాడాకు ఇంతకు ముందునుంచి ఉపయోగిస్తున్న వెండింగు మెషిన్లనే ఇప్పుడు కొద్దిగా విస్తృత పరచటం జరుగవచ్చునని ఈ వ్యాసంలో ఊహించబడింది.

"చివరకు పూర్తిగా యాంత్రికీకరణ చేయబడిన అంగడి, సూపర్ మార్కెట్ సాధ్యమైంది. మామూలుగా చూస్తే, ఉదాహరణకు, ఒక సూపర్ మార్కెట్టుకు ఆ బయట ఒక వెండింగ్ మెషిన్ గోడతప్ప మరేమీ కానరాదు. దాని వెనుక సంచార గ్రాసరీ గొలుసు యూనిట్లు సరుకు అందిస్తుంటవి. ఆటోమొబైల్ వస్తువులు కొనేవాళ్ళకు ఈ వెండింగ్ మెషీన్లే డబ్బు తీసుకొని వస్తువులు ఇచ్చి మిగతా చిల్లర ఇస్తుంటవి. అంతకంటే ఈ షాపులో ఒక గుమాస్తాగానీ, తనిఖీచేసేవాళ్ళుగానీ ఉండరు.

ముప్పై సంవత్సరాలలోపు కాలంలోనే ఈ వెండింగ్ మెషిన్ వస్తువుల అమ్మకం ప్రమాణం ఇప్పటి స్థాయి అందుకున్నది. మొదట్లో, ఇది పెన్నీ గమ్ - బాల్ మెషీన్లవరకే పరిమితమై ఉండేది. ఇప్పుడు ఈ యంత్రాలు 37,00,000 వస్తువులదాకా బట్వాడా చేయగలుగుతున్నవి. వీటిని దాదాపు 6,000 మంది మనుషులు నడిపిస్తున్నారు. ఈ యంత్రాలను సరైన స్థితిలో ఉంచే పనివాళ్ళ సంఖ్య కూడా పెరుగుచున్నది.

పూర్తిగా యాంత్రికీకరణం చేయబడిన అంగడి ఇంకా ఊహా మాత్రంగానే ఉన్నప్పటికీ చిల్లర వర్తక రంగంలో మూడు లక్షలమంది పనివాళ్ళకు ప్రాతినిధ్యం వహిస్తున్న చిల్లర వర్తక గుమాస్తాల అంతర్జాతీయ సంఘం ఈ వెండింగ్ మిషీన్ వల్ల రాగల ప్రమాదాన్ని గురించి ఆందోళన పడుతున్నది.

ఈ అసోసియేషన్ అధికార పత్రిక రిటెయిల్ క్లర్క్స్ అడ్వొకేట్ యాంత్రిక బట్వాడాలో వస్తున్న సాంకేతిక అభివృద్ధి ఫలితంగా రాగల ఫలితాలను

గురించి దాని అనుబంధ స్థానిక యూనియన్లను హెచ్చరించింది.

"చిల్లర వర్తక స్వరూపాన్ని మార్చటానికి భారీ ఎత్తుల ఆటోమాటిక్ పద్ధతులు అనుసరించటంవల్ల బృహత్తర సాంఘిక, ఆర్థిక సమస్యలు ఏర్పడగలవు."

"పారిశ్రామిక రంగంలో యంత్రాల అభివృద్ధి మూలంగా అనేకమంది కార్మికులు పనులు కోల్పోయినట్లే — చిల్లర వర్తకంలోకూడా యంత్రాల వాడకంవల్ల పలువురి ఉద్యోగాలకు ముప్పు రావచ్చును" అని ఆ పత్రిక హెచ్చరించింది.

యాంత్రికీకరణవల్ల కలిగే దుష్ఫలితాలు - పనులు తగ్గిపోవటం, ఉద్యోగాలు ఊడటంలాంటి వాటి పరిష్కారానికి న్యాయమైన మార్గాలు అన్వేషించవలసిందిగా ఈ అసోసియేషన్ స్థానిక సంఘాలను కోరింది. అయితే సాంకేతిక మార్పులకు ట్రేడ్ యూనియన్ ప్రతికూలం కాదనికూడా ఈ అసోసియేషన్ మరొక ప్రకటనచేసింది. కాని, ఈమార్పుల ద్వారాకలిగే సత్ఫలితాలను వ్యాపారస్థులు, వినియోగదార్లతోపాటు పనివాళ్లుకూడా పంచుకొనే విధంగా ఉండాలి అని ఈ సంఘాలు అంటున్నవి.

ఆర్థిక సదాలోచన దృష్ట్యా ఆర్థికవ్యవస్థ ఉత్పాదన శక్తి పెంపుదలకు సంబంధించిన సత్ఫలితాలను అందరూ పంచుకోవాలి. మంచి వేతనాలు, పనిచేసే పరిస్థితులలో అభివృద్ధి, పని గంటల కుదింపు, అవకాశమున్నంతవరకు వస్తువులకు తక్కువ ధరలు, అధిక ప్రమాణంలో జరిగే అమ్మకాలద్వారా హెచ్చు లాభాలు, అమ్మిన ప్రతివస్తువుకు కొద్ది లాభంద్వారా ఈ పంపిణీ సాధించాలి అని చిల్లర వర్తక గుమాస్తాల అంతర్జాతీయ సంస్థచేసిన ప్రకటనలో పేర్కొనబడింది.

ఈ విధంగా, జీవన ప్రమాణాన్ని పెంపొందించటం ద్వారా ఆర్థికవ్యవస్థ అధిక ఉత్పాదన శక్తి ఫలితాలను యావత్తు దేశము పంచుకోవీలౌతుంది అని ఆ ప్రకటన ఘోషిస్తున్నది.

——(o)——

(322 వ పేజీ తరువాయి)

ప్రతి యకరము భూమిని సాగుక్రిందికి తేవడము. అయితే వందలు, వేలు యకరముల భూస్థిమితముగల భూస్వాములు స్వయంగా సాగుచేయగల భూమిని యుంచుకొని అదనపుభూమిని భూవసతిలేని వ్యవసాయ కూలీలలకు, రైతులకు సాగుకువదిలితే ఉత్పత్తితప్పక పెరుగుతుంది. భూమిమీద నాధారపడువారికి జీవనము ఏర్పడుతుంది.

తృప్తికరమైన ప్రతిఫలములేక శాశ్వతంగా రైతులు, రైతుకూలీలు ఆర్థిక దుస్థిలో గిజగిజలాడుతూయుంటే భూస్వాములు వారి కష్టంతో కలకాలం మహోన్నతమైన జీవితహర్మ్యాలను నిర్మించుకోవాలని తాపత్రయపడటంకాని, దాన్ని సమర్థించడం కాని అభివృద్ధి నిరోధకమేకాగలదు.

ప్రభుత్వమైనా సహకార వ్యవసాయమును బలవంతం చేయకుండా వేలు, వందలు యకరాల భూవసతియుండి తృప్తికరముగా ఉత్పత్తులను పెంపొందించని భూస్వాములనుండి అదనపు భూములను తృప్తికరమైన ప్రతిఫలము సమకూరే పద్ధతులలో రైతులకు, రైతుకూలీలకు కౌలుకిప్పించి వ్యవసాయమున కవసరమగు ఆర్థిక వసతులను తక్కువ రేటు వడ్డీకి కలిగించవచ్చును. మరొకప్రక్క భూదానోద్యమంలో సేకరించబడి పంచిపెట్టబడిన భూములను, సన్నకారు రైతుల భూములను సహకార వ్యవసాయంమూలంగా సాగుచేయవచ్చును. ఫలితాలు ఏపద్ధతిలో మెరుగుగానుంటే దానిని విస్తృతంచేయవచ్చును.

సహకార సేద్యమైనా క్రమబద్ధంగా, ఆదర్శలక్ష్యాల కనుగుణంగానిర్వహించబడిననాడే **ఒడిదుడుకులకు గురికాదు.**

# మారిన మనసు

శ్రీ కేసిరాజు సోమేశ్వరరావు

దూరాన రోదసీ కుహరాన తపనుడు నిస్తేజుడై వాలిపోయాడు. సంధ్యారుణ కిరణాలతో సయ్యాటలాడుతూ మంద వాయువులు మెల్లమెల్లగా వీస్తున్నాయి. మాటిమాటికి ముందుకు పడుతూ మొహంపై లాస్యం చేస్తున్న ముంగురులను వెనక్కి తోసుకుంటూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు రాజు.

ఉదయమే జానకి వద్దనుండి ఉత్తరం వచ్చింది. పూర్వం ఇచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవలసిందని, ఒక పర్యాయం తమ గ్రామం రావలసిందని వ్రాసిందామె. మరదలు వ్రాసిన ఉత్తరంలో విశేషాలేమి లేకపోయినా కలతజెందిన ఆతని మనస్సు మరింత కలవరపడింది.

గతస్మృతులన్నీ ఒక్కసారిగా ఆతని కనులముందు తిరిగాయి. వివాహం చేసుకోవాలనే అభిలాష లేకపోయినా తండ్రి కోరిక కాదనలేక పెళ్ళి చూపులకని బయల్దేరి వెళ్ళాడు రాజు. పట్టణంలో ఉండి ఉండి ప్రశాంతతకు మొహంవాచిన రాజుకు ఆపల్లెటూరు మిక్కిలి ఆహ్లాదం కలిగించింది! పెళ్ళికూతురింటివారు చేసిన మర్యాద ఆతన్ని మరింత సంతోషపెట్టింది. ప్రకృతి సౌందర్యాని పుణికి పుచ్చుకున్నట్లున్న తన సహజ సౌందర్యంతో సుశీల రాజుకళ్ళను జిగేల్‌మనిపించింది. **రాజు వివాహానికి ఒప్పుకున్నాడు.**

వారిరువురి మధ్యా అనురాగం లతలా పెనవేసుకొని పోయింది. అభ్యుదయ భావాలుగల రాజును సుశీల తన అందచందాలతోనూ నిష్కళంకహృదయంతోనూ ఆకర్షించి ఆతని పవిత్రప్రేమను చూరగొంది. కాని విధి బలీయమైంది. రెండేళ్ళయినా తిరక్కముందే మూడు నాళ్ళజ్వరంతో బాధపడి మరణించింది సుశీల. ఆమె మరణంతో రాజు జీవచ్ఛవంలా తయారయ్యాడు. గతించిన మధురస్మృతులాతని కళ్ళల్లో మెదుల్తూ ఆతని మనస్సునుకలవరపరచాయి. మనోవ్యథతో మంచంపట్టాడు.

రోజులు గడిచినా రాజు కోలుకోలేక పోయాడు. డాక్టర్లిచ్చేమందులు నిరుపయోగ మయినాయి. ఎప్పుడూ ఏదో గొణుగుకుంటూండేవాడు. అందర్ని అనవసరంగా అసహ్యించుకొంటూ, చెంత రానిచ్చేవాడు కాదు.

జానకి తన అక్క మరణానికన్నా రాజు హృదయ దౌర్బల్యానికి ఎక్కువ కలవరపడింది. ఎప్పుడూ కళ్ళతో నవ్వుతూ అందర్ని నవ్వించే రాజు యీ ఆకారాన్ని దాల్చటం ఆమెకు మరింత వ్యధ కలిగించింది. అక్కమరణవార్త విన్నదే తల్లిదండ్రులతో ఆమె ఇక్కడకు వచ్చింది. అది మొదలు రాజు సేవలో నిమగ్నమయింది. **వేళకు మందివ్వడంలో ఆహారపానీయాలు సమ**

కూర్చడంలో ఒక్కోరోజు ఆమెకు నిద్రాహారాలు ఉండేవికావు.

స్వగ్రామానికి తల్లిదండ్రులతో ప్రయాణమై జానకి రాజువద్ద సెలవుతీసుకోడానికి వచ్చింది. ఆమె కళ్లల్లో నీళ్లుతిరగడంచూచి రాజు కళ్ళుచెమర్చాయి. ఆరోగ్యవంతుడయింతరువాత ఆమెకోరిక ప్రకారం వాళ్ళఊరు తప్పక వస్తానని రాజు జానకికి వాగ్దానమిచ్చాడు.

ఆ వాగ్దానాన్ని నిలబెట్టుకోవాలని నిశ్చయించుకున్నాడు రాజు. లేచి బరువైన హృదయంతో ఇంటి ముఖంపట్టాడు. మరునాడే తన అంగీకారాన్ని తెలుపుతూ జానకికి ఉత్తరం వ్రాశాడు.

◆ ◆ ◆

ఆరునెలలయింతరువాత అకస్మాత్తుగా ఇప్పుడు జానకి రాజుచేసిన వాగ్దానాన్ని అతనికి గుర్తుచేయడానికి కారణంలేకపోలేదు.

రాజు కొద్దికొద్దిగా కోలుకోవడం అతనిలో పూర్వపు కళకాంతులు రావడం తండ్రిగారైనా రాజారావుగారికి కాస్త ధైర్యంకలిగించాయి. కిలకిలలాడుతూ చిలుకా గోరింకలలానుండిన రాజు, సుశీల గుర్తుకువచ్చి ఆయన బాధపడ్డాడు. ఇంత చిన్న వయస్సులోనే పత్నీవియోగమైన రాజకు మళ్లీవివాహం చేయాలనే తలంపు కలిగిందాయనకు. కాని రాజు అభీష్టాన్ని తెలుసుకోందే ఏ ప్రయత్నము చేయరాదని నిశ్చయించుకొన్నాడు.

ఒకనాడు రాజతల్లి సుందరమ్మ, భోజనాలవేళ పెళ్లి ప్రసక్తి తెచ్చింది. రాజు అగ్గిరాముడయాడు. అతని హృదయంలోని గాయాన్ని గట్టిగా కెలికినట్లయింది. జేగురించిన ముఖంతో అతడు, ఇక పెండ్లియాడదలచలేదని, జీవిత పర్యంతం ఇలాగే గడుప దలచానని, సుశీలకీ జన్మలో ద్రోహం తలచలేనని తీవ్రంగా చెప్పాడు.

రాజారావుగారు కూడా రెండుమూడుసార్లు రాజువద్ద వివాహప్రసంగాలు తెచ్చారు. మనుమడిని ఎత్తుకొనే ఆశ కల్పించమని రాజును ఎంతగానో బ్రతిమలాడారు. కాని రాజుపట్టుదలకు ఎదురు చెప్పలేకపోయారు. ఏవిధంగానయినా రాజును ద్వితీయ వివాహానికి ఒప్పించాలని ఆయన ఆలోచించసాగారు. రాజును ఆకర్షించగలిగి, సరియైన మార్గంలోకి త్రిప్పగలశక్తి జానకికిమాత్రమే కలదని ఆయనకు స్ఫురించింది. తక్షణమే రాజరావుగారు వియ్యంకుడి గ్రామానికి బయలుదేరి వెళ్లారు.

రెండురోజుల్లో అక్కడ మంతనాలను ముగించుకొని వెళ్లిన కార్యం జయప్రదంగా ముగించుకొనివచ్చిన సంతృప్తితో స్వగృహానికి వచ్చారు. తత్ఫలితంగానే జానకి వద్దనుండి రాజుకు ఆరోజు ఉత్తరంవచ్చింది.

◆ ◆ ◆

స్టేషనుకు శేషయ్యగారు బండి తీసుకొని వచ్చారు. గుమ్మంలో జానికి, శాంతమ్మలు స్వాగతం చెప్పారు. ఆ యింట్లో రాజుకు ప్రత్యేకంగా ఒకగదిలోనే తన అక్క ఫోటోను గోడకు అలంకరించింది. రాజారావుగారు తమ ఊరువచ్చినప్పటినుండి రాజు ముందు ఎలా ప్రవర్తించాలో తెలి

యక సిగ్గుతో కాళ్లాడేవికావు ఆమెకు రోజూ ఉదయమే కాఫీ మొదలు రాత్రి నిద్రపోయేవరకూ రాజుకు సంబంధించిన సమస్తపనులూ ఆమే చూడసాగింది. ఆమె నవ్వుతూ చిన్న చిన్న ప్రశ్నలను వేస్తోంటే సుశీల జ్ఞాపకంవచ్చేది రాజుకు. రోజురోజుకు సిగ్గుతగ్గిపోగా జానకి అతనికి మరింత సన్నిహితంగా సంచరించసాగింది.

జానకి సుశీలకంటే వయస్సులో రెండేళ్లు చిన్నదైనా దాదాపు వారిరువురూ కవల పిల్లల్లాగ ఉంటారు. ఒకటి రెండు సార్లు చూచినవారికైనా వారిరువురిలో సుశీల ఎవరో జానకి ఎవరో చెప్పుకోవడం కష్టమైనపనే.

యౌవ్వనంతో మిసమిస లాడుతున్న శరీరంలోని వంపు సొంపులతో సతతం నవ్వుల దేవతవలె నవ్వుతూ తనయందు ఎక్కువ ఆప్యాయత చూపుతున్న జానకి అంటే రాజుకు ఒకవిధమైన ఆకర్షణ కలిగింది. అతని హృదయం అతనికి తెలియకుండానే జానకి సమక్షాన్ని కోరసాగింది. అతని చూపులు ఆమె శరీరసౌందర్యాన్ని ఆస్వాదించడంలో నిమగ్నమయ్యేవి. జానకి ఎదుట లేకపోతే ఏదో తీరనిలోటుగా అనిపించేదతనికి. తన మనస్సులో జరిగే పరివర్తన నర్థం చేసుకోలేక సతమతమయ్యేవాడు రాజు.

అతడు ప్రతి సాయంకాలం షికారుకు వెళ్లేవాడు. జానకి, సుశీలలను గురించి ఆలోచించేవాడు. జానకి సౌందర్యం, మృదుపలుకులు, అతని హృదయంలోని పాతపడిన మధురానుభూతులను జ్ఞాపకం చేసేవి. జానకితో మాటాడుతూంటే ఏదో తెలియని అనిర్వచనీయానందం పొందేవాడు రాజు. ఆమెనుచూడని నిమిషం ఒకయుగంగా మారిందాతనికి.

ఒకనాటి సాయం సమయం జానకి కూడా రాజువెంట షికారుకు బయలుదేరింది. కబుర్లు చెప్పుకుంటూ వారిద్దరూ పొలాలవైపు వెళ్ళారు, దూరాన కొండలు నీలిమునుగులతో సర్కసుడేరాల్లా కన్పిస్తున్నాయి. జానకి వనదేవతవలె అక్కడే మామిడిచెట్లక్రింద తిరుగసాగింది. తిరుగుతూ తిరుగుతూ ఆమె రాజువద్దకు వచ్చింది. ఆ సంధ్యాసమయపు స్వర్ణారుణ కిరణాలలో ఆమె అప్సరసవలె వినూత్న సౌందర్యాన్ని ఒలికిస్తో, అధోముఖంతో ఏదో ఆలోచిస్తోన్న రాజుతో "బావా, ఏమిటి ఆలోచిస్తున్నావు" అంది నవ్వుతూ. "ఆ! ఏమిటి" అంటూ తిరిగినరాజు ఆమె అందానికి నివ్వెరపడ్డాడు. అంతవరకూ సుశీలను గురించే ఆలోచిస్తున్నాడేమో! అతనికి జానకిలో సుశీల కన్పించింది. వాస్తవజగత్తునే మరచిపోయిన రాజు హఠాత్తుగా లేచి జానకిని తన బాహువులలో బంధించాడు. "సుశీలా! ఎంతకాలానికి కన్పించావు. నన్నొంటిగ విడచివెళ్లుట నీకు న్యాయమేనా, నీకోసం ఎంత కాలంగా తపిస్తున్నానో తెలుసా. ఏమయినా నిన్ను ఇక వదలను." అంటూ ప్రలాపించడం మొదలెట్టాడు. అతని కౌగిలినుండి వదిలించుకొనేసరికి జానకికి తల ప్రాణం తోకకువచ్చింది. అతని స్పర్శతో ఆమె శరీరం జలదరించింది. ఆమెవదనం సిగ్గుతో వాలిపోయింది. దూరంగా వెళ్ళిన

జానకినిచూసి మత్తువదలిన రాజు తన అనుచిత ప్రవర్తనకు పశ్చాత్తాపపడినాడు. జానకిదగ్గరగావెళ్ళి "క్షమించు జానకి! మరో ప్రపంచంలోనున్న నేను మైమరపున నిన్ను అనుచితంగా ... ... ... క్షమించు" అని ప్రార్థేయపడి దూరంగా వెళ్ళిపోయాడు.

అతని స్థితికి జానకి జాలితో కరిగి పోయింది. మెల్లగా అతన్ని సమీపించి, "బావా రా ఇంటికిపోదాం" అంది. కాని రాజుకు ఆమెముఖం చూడటానికి చెల్లక సిగ్గుతో తలవంచుకొని ఆమెవెంట నడి చాడు.

మరునాటినుండి రాజుఎదుటికి వెళ్ళడం ఆమె తగ్గించింది. రాజుకు ఆమె రాకపోవ డంతో ప్రాణసమానమైన వస్తువును జార విడచుకొన్నట్లయింది. సుశీలతో సమా నంగా రూపురేఖలు తనలో ప్రతిఫలింప జేసికొని జానకి తన హృదయంలో స్థానం ఏర్పరచుకుందని రాజు గ్రహించాడు.

రాజుకు జానకిపై ఆకర్షణ బలీయమై పోయింది. ఆమెనుగురించిన ఆలోచనల దూరంగానెట్ట ప్రయత్నించాడు. కాని అతనివలన సాధ్యంకాలేదు. సుశీలను పోగొట్టుకొన్న రాజు, జానకిని తన దాన్నిగా చేసుకోవాలని మొట్టమొదట సారిగా అనిపించింది. కాని రెండోపెళ్ళి వాడినయిన తన్ను పెండ్లియాడుటకు జానకి సమ్మతిస్తుందా అన్న సంశయంతో అతని మనస్సు ఆరాటపడసాగింది.

సాయంత్రం జానకి తన అక్కఫోటో ముందు దీపంవెలిగించి అంజలి ఘటించి నిశ్చలచిత్తయై నిలబడియుంది. రాజు మెల్లగావెళ్ళి ఆమె వెనకగా నిలబడి సుశీల ఫోటోముందు అంజలి ఘటించాడు. తన ప్రక్కనున్న బావనుచూచి జానకి "ఏమిటి బావా నీకు మళ్ళీ పిచ్చెక్కిందా" అంది నవ్వుతూ. రాజు ఆమెచేతిని తన చేతిలోకి తీసుకొని "పిచ్చికాదు జానకీ మనలనిద్దర్నీ ఆశీర్వదించమని మీఅక్క య్యను ప్రార్థిస్తున్నాను. నీహృదయంలో స్థానంకావాలి జానకీ! కాదనక నన్ను అనుగ్రహించు" అన్నాడు. జానకి సిగ్గుతో తలవంచుకొంది. రాజు ఆమెను తన హృద యంలో దాచుకున్నాడు.

రాజు, జానకిని వివాహమాడటానికి సమ్మతించాడన్న ఉత్తరం అందుకొని "ఏమేవ్ ఇలారా" అంటూ రాజారావు గారు తనే వంటింట్లోకి పరుగెత్తారు.

—o—

## భూమిమీద ప్రాణి ఎప్పుడుపుట్టింది ?

భూమండలంపైన ప్రాణి యెప్పుడు పుట్టియెలా పరిణామాన్ని పొందినది అన్న విషయాన్ని గురించి అలెగ్జాండర్ రొనోవ్ అనే సోవియట్ విజ్ఞాన శాస్త్ర వేత్త కొత్త సిద్ధాంతాన్ని చేసారు. అతి సాధారణరూపంలోని ప్రాణులు, ముఖ్యంగా నీటిలో ఉండే నీలి - ఆకు పచ్చ రంగు మొక్కలు వెయ్యి మిలియన్ సంవత్సరాలకు పూర్వం ఉద్భవించి పరిణామాన్ని పొందాయని ఆయన సిద్ధాంతీకరించారు.

తాష్కెంట్‌లో జరిగిన అఖిల యూనియన్ భూగర్భశాస్త్ర మహా సభలో ఒక వ్యాసాన్ని చదువుతూ రొనోవ్ యీ విషయాన్ని తెలియజేసారు.

భూమండలం పుట్టినది మొదలుకొని ఉంటూవచ్చిన వాతావరణ పరిస్థితులను గురించి పరిశోధనలను జరిపినమీదట, ప్రాటిరోజోయిక్ యుగంలో ప్రాణి ఉద్భవించిందని ఈయన కనిపెట్టారు.

# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రాధాకృష్ణయ్య

★

(గత సంచిక తరువాయి)

ఒక స్త్రీ స్నానము చేసి వేరు వస్త్రములు ధరించుటలో తన కంఠాభరణము - బంగారు గొలుసు - జారిపోయినదని తలచెను. ఇల్లు, వాకిలి, పెరడు, ఇరుప్రక్కల వెదికెను. వెదకుట హెచ్చుచుండగా, పొత్తుదొరకుటలేదు. ఆ వేదన హెచ్చుచుండెను. కడకు దిగులుతో పడిపోయెను. అపుడు ఆమె భర్త ఇంటిలోనికి ప్రవేశించెను. ఆమె భర్తకు తన నష్టమును తెలుపుకొని ఏడ్చెను. ఈ అవస్థలో భర్తకు ఏదో పచ్చగ కనబడెను. ఆ మెడలో యుండునదేమిఅని విచారించెను. భర్త ఎగతాళి చేయుచును నమ్మకము కలదు కనుక ఆమె నెమ్మదిగా చేతితో మెడను తడుపుకొనెను. ఒకగజ్జె చేతికితగిలినది. వెంటనే, తన కంఠాభరణము తనవద్దనేయున్నదని తెలుసుకొనెను. తెలుసుకొనుట అవసరముగ, దుఃఖమంతయు మాయమాయెను. తన సహజ ఆనందస్థితి పొందెను.

కంఠాభరణమును భర్త క్రొత్తగ తయారుచేయించలేదు. అది అచ్చటనే సదాయున్నది. తనవద్ద అది లేదు అను భ్రమ, స్త్రీయొక్క దుఃఖములకు కారణమాయెను. కంఠాభరణము నష్టముకాలేదని తెలుసుకొనగా, దుఃఖములన్నియు తొలిగెను. తాను ఈ భ్రమపొందుటకు పూర్వముండిన శాంతపదవిని మరల అనుభవించెను. కంఠాభరణము నష్టము కాలేదను జ్ఞానము కలుగగనే, ఆమె తన పూర్వస్థితిని పొందుచున్నది. అనగా భ్రమ తొలుగగ, భ్రమవల్ల కలిగిన దుఃఖములు తొలుగుచున్నవి. బుద్ధియందలి భ్రమ తొలగుటవల్ల మరల ఆమె తన పూర్వస్థితిని పొందుచున్నది.

మనము ఆత్మస్వరూపులము, అయినను, మనలోని జీవుడు తానొక జీవుడను స్వప్నమును అనుభవించుచున్నాడు. తాను జీవుడనినమ్మి, ఆత్మపదవిని కోలుపోయి, సర్వదుఃఖములను ఆందోళనములను అనుభవించుచున్నాడు. జీవపతియగు సద్గురువు జీవుని వ్యవహారములయందు సహాయపడుచు జీవుడు తన ఆత్మపదవిని కోలుపోలేదని తెలుపుచున్నాడు. జీవపదవి పరిపూర్ణ వైభవముతో ప్రకాశించుచున్నది అని తెలుపును. జీవునికి గురువుయొక్క వాక్యముల యందు నమ్మకమున్నది కనుక భక్తిశ్రద్ధలతో నమ్ముచున్నాడు. పిమ్మట తనయందు తాను ఆత్మగా యున్నాడని స్వయముగా తెలుసుకొనుచున్నాడు. ఆత్మజ్ఞానము కలుగుటవల్ల తాను ఆత్మయగుచున్నాడు.

ఇట్టి ఆత్మజ్ఞానసిద్ధాంతమే వేదాంతమునగల ముఖ్యసిద్ధాంతమును. ఆవిషయమును ఈ కేనోపనిషత్తునందలి చివరి మంత్రమున సూచింపబడుచున్నది. దీని భావము బాగుగ తెలిసినవారు ఈ ఉపనిషత్తు వాఙ్మయమున ఈమంత్రము అతిఉత్కృష్టమయినదని ఒప్పుకొనగలరు. ఇంతవరకు వివరించిన భావములను చక్కగ గ్రహించి, పాఠకుడు ఈమంత్రమునందలి భావమును విమర్శించినచో, ఇందులో గల సౌందర్య రహస్య గుణములను స్వయముగ తెలుసుకొని ఇది సత్యదేవియొక్క ప్రతిబింబమని నమ్మగలడు.

ఓం సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై, తేజస్వి
నావధీతమస్తు, మావిద్విషావహై ॥
ఓం. శాన్తిః శాన్తిః శాన్తిః

—(౦)—

# హిత రత్నములు

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

బూరవల్లి

(గతసంచిక తరువాయి)

తమ దేహము, తమ గేహము
దమ ప్రాంతము శుభ్రతకును। దావొసగిన చో
దమ యారోగ్యం బెంతో
విమల వికాసమ్ము గాంచి। వెలయును, హితుడా!

ఘోరంపు టంటు వ్యాధులు
చేరిన నవి దాచిపెట్ట। చెడుగే కూడున్
గ్రూరముగ దలచి వానికి
దూరముగా నుండు టెంతొ। దొడ్డగు, హితుడా!

చేతిరుమాలున బలుమరు
మూతియు, జేతులను దుడిచి। ముటికిని గొనుచున్
బ్రీతిగ జేబున నిడుకొను
నీత లనాచారమందు। జేరును, హితుడా!

వేసము వేసుక తిరిగే
మోసపు మనుజులను జేర। మోసము, ప్రేమన్
బోసిన పాలను ద్రావుచు
మోసము దలపోసి పాము। పొడవదె? హితుడా!

ఎఱిగియు బలవంతుని తో
సరిగా దులదూగ నెంచ। సాధ్యం బగునా?
త్వరగా బోయెడి మోటరు
పరుగిడి దానొక్కబోవు। పగిదిని, హితుడా!

జాతుల, మతముల నెంచుచు
ఘాతకులై నీతిమాలి। కలహించుటచే
ఖ్యాతిని జెడి బాధలగని
గోతిని పడు గొడ్డరీతి। గుందరె! హితుడా!

మోసము జేయగ కపటపు
వేసములను వేసికొనుచు। భిక్షుకుల క్రియన్
దోసిలి యొగ్గడి చోరుల
మోసము నవరింప లోక। పూజ్యము, హితుడా!

సిరివిగ సంపద గాంచియు
ధరలో దా దినక లోభి। దాచుట యెల్లన్
చెఱకుల బండిన్ గూర్చొని
కొఱుకుట ముసికోల కాదె। గోరిక, హితుడా!

తానును శక్తిపరుండై
దీనత వేడొకని శక్తి। తేజము గోరన్,
హీనత గాంచక తగు స
న్మానిత మున వెలయ గలడె। మహిలో, హితుడా!

ఆశింపకు పరధనముల
నాశించిన కీడు లొదవి। యాశ లడంగున్,
ఆశించియు గాలామున
నాశనమును బొందు చేప। న్యాయమె, హితుడా!

సుంత దురాశ వహించిన
చింతనుగల ధనముబాసి। చింతను జెదు దా

నెంతటి ధీరుండైనన్,
చింతలు వడిగాలికిబడి। చెడుగతి, హితుడా!

తన పొరుగుపచ్చ నోర్వని
మనుజుడు చింతను మునింగి। మనలేడు సుమీ!

యిన రశ్మి గాంచజాలక
గను మూసిన ఘూకకులము, కరణిని, హితుడా!

ధనరాశి గలిగియును స
ద్వినియోగము గానియట్టి। వెచ్చము సలిపే

ధనికుని కన్నను ధన్యుడు
ధన హీనుడె న్యాయ నటన। ధారుణి. హితుడా!

పెరడున కాయలు, కూరలు
విరివిగ బండించి వాని। వెల గొనవచ్చున్,
మఱియును దినదగు నింటను,
పెరడును వృథగాను దలచి। విడువకు, హితుడా!

బీడులు, బంజరు భూములు
పాడుగ దలపోయకుండ। ఫలియించుటకై
వీడక కృషి సలుపుటచే
గూడును దేశమున పంట। కొల్లగ, హితుడా!

కను మైకమత్య గుణమును,
గను వినయ విధేయతలను,। గను శాంతంబున్

గనుమ! యుదార స్వభావము
గని గాంధిజి మిగుల యశము। గాంచిరి, హితుడా!

వదలును ధన గౌరవములు
పదవీ వ్యామోహమునను। బదు వారలకున్

సదమలులు గాక పదవికి
విధిగా నెన్నికల నిలిచి। వీగుట! హితుడా!

ముప్పు ఘటిల్లదు శాంతము
దప్పక హింసా వ్రతమ్ము। దనరెడు వారిన్,
ఎప్పు డహింసా వ్రతమును
దప్పని కాంగ్రెస్సు జయము। దలపవె! హితుడా!

నతవారిని విడిచియు బర
జనముల తప్పులను నెంచు॥ జడు డెన్నండున్

తన చల్ల పుల్లకాదని
వెనుకీయక బలుకునట్టి। విధమున, హితుడా!

పిడికెడు ముష్టి యశక్తున
కిడకుండను నిందసేయు। టిల ధర్మంబే
చెడురోగ మెన్నడైనను
బడి యితర సహాయ మడుగ। బడదే? హితుడా!

కించిద్విజ్ఞానము గల
కొంచెపు నరులెల్ల మిగుల। గొప్పగ దిరుగన్

వంచకులు గాక దేశపు
మంచికి దావాసగగలరె। మహిలో, హితుడా!

అందఱి యానందములను
బొందంగా దలచి రంగ। భూమిని కళలన్
వందనమౌ కౌశలమున
నిందల పాల్గాంచ బోక। నెఱపుము, హితుడా!

(సశేషము)

# వాసవదత్త

మూలం :

పండిత గోవిందవల్లభ పంత్

అనువాదం :

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

వాసవదత్త సౌందర్యము పూర్ణచంద్రునికన్న పూర్ణమయినది, ఆమె దేహము కమలముకన్న కోమలమైనది. ఆమె వాణి వీణను సైతం తిరస్కరిస్తుంది. ఆమె గౌరవపూర్ణ నయనాలు హరిణిని సైతం సిగ్గిల చేస్తున్నాయి. స్వర్గసౌందర్యం తన రుచి ననుసరించియే స్వహస్తాలతో ఆ సజీవస్వర్ణ ప్రతిమను నిర్మించింది. ఇట్టి భువనమోహనమైన శోభ ఇట్టి రుచిర (శోభా రాశి) రూపరాశిని యిచ్చికూడా విధాత ఆమెను 'వేశ్య'గా జీవించువడం ఉచితమేనా? పంకమందు పద్మాన్ని, కంటకాలలో కుసుమాలను వికసింపచేసే వానికే తెలియాలి!

ఆనాడు బాలవసంత మధుమాపూర్ణ ప్రభాతంలో కోకిల కరుణగానాన్ని వక్షస్థలంతో ఆలింగనం చేసికొన్న మలయ-సురభి తనమనస్సుతో ప్రవహిస్తూంది.

ఒక శ్రమణుడు వాసవదత్త సువిశాల ప్రాసాద ద్వారందగ్గర భిక్షార్థంవచ్చి నిలబడ్డాడు. అకస్మాత్తుగ వాసవదత్తదృష్టి అతనిమీదపడింది. ఆమె అతనిని ఒకసారి చూచింది, వందసార్లు చూచింది. అలా చూస్తూనేవుంది.

అతడిపేరు ఉపగుప్తుడు. సాంసారికదృష్ట్యా అతడు భికారి, కానీ స్వర్గీయదృష్ట్యా అతడు రాజ రాజేశ్వరుడు. మనస్సునుమించి విస్తృత రాజ్యమెచ్చటను లేనేలేదు. ఉపగుప్తుడు ఆ మనోరాజ్యంమీదనే విజయం సంపాదించాడు. అతడు రాజేశ్వరుడు. సమస్తయింద్రియాలు అతని ప్రజానీకం.

విశ్వచాంచల్య, అశాంతుల విషయం అతనికి బాగా పరిచితమైనవి. స్వర్గీయ దివ్యశోభ అతని వదనకమలాన భాసిల్లుచున్నది. కాషాయవస్త్రాలు తనికి అపూర్వశోభను ప్రధానం చేయుచున్నది.

విశ్వాన్నంతటినీ తన సౌందర్యంచే పరాజితం చేసిన వాసవదత్త ఆభిక్షువునకు నతమస్తకయైనది. అతని సౌందర్యానికి ముగ్ధయైనది. ఆమె కౌశేయ వసనం వక్షస్థలాన్నుంచి కొద్దిగ జారిపడింది.

శిథిలమైపోయింది. అందు గ్రథితమైన పుష్పరాశి ముక్తయై పృథ్విపైబడింది.

ఆమె ఉపగుప్తుని సమీపించి పల్కింది.

"భిక్షూ! భిక్షాపాత్రమును ముందుకు చాచు"

భిక్షాపాత్రమునుచూచి హఠాత్తుగ ఉపగుప్తుడు ఆశ్చర్యంగ పల్కాడు. "కానీ నీహస్తద్వయం రిక్తంగా ఉందికదా? యిక నాకేమి యీయ గలవు"

వాసవదత్త: నీకీ ప్రపంచమందెచ్చటను లభించని వస్తువును యీహస్తాలిస్తాయి. అంతేకాదు యీ చేతులా వస్తువును నేటిదనుక ఎవ్వరికీ ప్రదానం చేయలేదు.

ఉపగుప్తుడు : "అంటే......"

వాసవదత్త, "ఈహస్తాలు రిక్తమైనవి కావు"

ఉపగుప్తుడు : నేనీ స్వర్ణాభూషణాలనేమి చేయుదును.

వాసవదత్త: నేనీ స్వర్ణభూషణాల విషయం చెప్పుటలేదు. అబోధయువకుడా! యివి రిక్త హస్తాలుకావు ప్రేమాలింగన పరిపూర్ణాలు; నేను అదే ఆలింగనాన్ని నీకిస్తా భిక్షూ! ఒక్కసారి కల్పన చేసికో ఏవాసవదత్త ఛాయాస్పర్శకోసం గొప్ప గొప్ప రాజేశ్వరులు సైతం వ్యాకులపడతారో, ఆప్రేమాలింగనాన్ని నీకర్పిస్తా."

ఉపగుప్తుని ముఖభావాల్లో లేశమాత్రం పరివర్తన కలుగలేదు. వాసవదత్త మరల ప్రారంభించింది. "భిక్షాపాత్రను ముందుకుచాచు. నేను భిక్షగా నాహృదయాన్ని సమర్పిస్తాను." ఉపగుప్తుడు ప్రశ్నించాడు – "దీని అర్థం?" వాసవదత్త – "ఈ నీసుకుమార దేహం భిక్షార్హమైనది కానేరదు. ఈనీ అనుపమ సౌందర్యకుసుమం ప్రపంచ స్పర్శకు దూరముకావలసిన పథాలలో వాడి పోదగ్గదికాదు. రా! భిక్షూ!! నాసదనానికిరా! నేను విశ్వానికి స్వామికిని నీకు దాసురాలనయ్యెదను.

వాసనా ప్రభావముక్తయైన ఉపగుప్తుని ముఖమండలంలో హసితక్షీణ రేఖ కనిపించింది. అతడు నిశ్శబ్దచిత్తుడయ్యాడు.

వాసవదత్త వికల హృదయయై పల్కింది. "సమాధానం చెప్పు భిక్షూ" ఉపగుప్తుడు సమాధానమిచ్చాడు "కాని అనేక కారణాల కారణంగా యిది సమయం కాదు."

"అయితే ఎప్పుడు?" వాసవదత్త ప్రశ్నించింది.

ఉపగుప్తుడు: "మరల కొద్దిరోజుల్లో వస్తా"

"మరల కొద్దిరోజుల్లో వస్తా" — వాసవదత్త మనస్సులో ఆలోచించుకొంటూంది. రమణీరూపానికి అవమానమా? ఒక సామాన్యభిక్షువు తన అసమాన సౌందర్యాన్ని తిరస్కరించడమా? చూస్తానుగా! నీవా రోజుకై ప్రతీక్షిస్తాను.

ఉపగుప్తుడు ద్రుఢగతితో సంఘంవైపు వెళ్ళిపోయాడు. వాసవదత్త స్వర్ణమూర్తిలాగ అతనిని నీరవ నిశ్చలదృష్టితో చూస్తూ ఉండిపోయింది.

## 2

తన స్వల్పజీవిత ప్రకాశాన్ని చూసి సంధ్యాశ్రీ ప్రగతితో అదృశ్యమైపోయింది. శారదీయ శుభ్రాకాశంలో ప్రాచ్యదిశలో ఉదయోన్ముఖుడయ్యే చంద్రకిరణాలు యావజ్జ్యల వన్నెలను పృథ్వీమీద వెదజల్లుతున్నాయి.

ఒక పథుసారణ్య చరణాలను పవిత్రంచేస్తూ గంగ కలకల స్వరంతో ప్రవహింపుతోంది. భిక్షాభారంతో ఉపగుప్తుడు తనమఠానికి తిరిగి వస్తున్నాడు.

ఉపగుప్తుని రాకచూసి ఒకసింహం అతివేగంతో అతనిమీదకు దుముక సిద్ధమైంది. ఆ హింసా పశువు హృదయంలో కరుణామూర్తి బుద్ధదేవుని ప్రభావ ప్రసారము కాలేదు కాబోలు దాని రాక్షసప్రవృత్తిలో పరివర్తన కలుగలేదు.

ఒకవైపు సింహం ఉపగుప్తుని భక్షించ సంసిద్ధమైవుంది. వేరొకవైపాతడు దానిచే భక్షింపబడ సిద్ధుడై యున్నాడు.

సమీపంలోనే ఒకదట్టమైన పొదఉంది. ఆపొద హృదయభాగంలో ఒక బిలకవుంది. వసంత సంపూర్ణ పృథులతలోకూడా యథాశక్తి ప్రయత్నించినా ఆకులు దానిని కప్పలేకపోయినాయి. ఆబిలంలో దాగొన్న వ్యాధుడా భయానక దృశ్యంచూశాడు.

సింహం భిక్షువుమీదకు దూక సిద్ధమయ్యేసరికి ఆపొదలను చీల్చుకుంటూ ఆవ్యాధుడు ఆకర్ణాంతం బాణాన్నిలాగి సూటిగా సాటునటుల విడిచాడు. మరుక్షణంలో మృగరాజు ధరాశాయియైనది.

ఉపగుప్తుడు చకితుడై నల్దిశలా చూశాడు. తన కార్యసాఫల్యానికి మందస్మితం చేసికుంటూ ఆవ్యాధుడు ఉపగుప్తునివైపు రాసాగాడు.

భిక్షువు దుఃఖభరిత శబ్దాలతో వ్యాధునితో పల్కాడు "ఏమిచేశావు? ఇది నీకెంత కష్టం కలిగించింది. అకారణంగా నిరపరాధిని ఏల హత్య చేశావు?"

వ్యాధుడు మనసులో భావించసాగాడు "సింహం — నిరపరాధి"

తన దయాహీన కఠోరజీవితంలో వ్యాధుడు తొలిసారిగా కరుణాదేవిని దర్శించాడు. చిత్రాంకిత మూర్తిలాగ కొద్దిక్షణాలు నిలబడిపోయాడు. ఉపగుప్తుడు కరుణా పరిప్లావితదృష్టిని అతనిమీద నిలిపాడు. కనులు చూశాయి. హృదయం హృదయగత సందేశాన్ని గుర్తించింది.

వ్యాధుని హస్తద్వయం కదిలింది, అతడు భుజంమీదనుంచి తూణీరాన్ని తీసి గంగావక్షస్థలంలో విసరివేశాడు. అతని నిర్దయత్వం గంగాంకితమైంది. తన బలిష్ఠమైన చేతులతో వింటినివిరచి నేలమీద పారేశాడు. అతని కఠోరత అంతిమశ్వాస నన్వేషించ గలిగింది. అనంతరం వ్యాధుడు తన నూతన ప్రపంచ ప్రవేశానికి బయలుదేరుతూ భిక్షుచరణాల్లోపడి పల్కాడు. "దేవా! యిదేనా అంతిమహత్య" కరుణ అతనికి పథప్రదర్శక అయినది.

దయార్ద్రి ఉపగుప్తుడు ధరాశాయియైన మృగరాజువైపుచూశాడు. దాని ఛాతీలో బాణం దారుణంగా గ్రుచ్చుకొనివుంది. భిక్షువు చాలా కష్టంమీద దానిని గంగాతీరానికి తీసికొనిపోయాడు. అక్కడ దానిగాయాన్ని కడుగసాగాడు.

గంగా చంచల హృదయంతో దశదిశలయందూ గీతసుధా వృష్టిచేస్తూ ఒకనావపోతూవుంది. శరత్కాల నిర్మల చంద్రికలు సంపూర్ణ వికాసంతో విరాజిల్లుతున్నాయి.

ఉపగుప్తుడు తన కార్యమందు నిమగ్నుడై యున్నాడు. సింహం జీవించే ఆశ బహుతక్కువ. అయినా భిక్షువు దత్తచిత్తుడై తన కార్యాన్ని చేసికొని పోతున్నాడు.

నావ అవైపే రాసాగింది. గాన స్వర మధురు ఉపగుప్తునకు స్పష్టంగా వినిపిస్తున్నది. నావలో మరెవ్వరు లేరు. ఆమె! మత్తకుంతల!! రూపసి!!! వాసవదత్త!!!! శరచ్చంద్రునితో కబుర్లు చెపుతూ వస్తూంది. భిక్షువు సింహహృదయస్థ శరాన్ని బయటకుతీయ చేయబోయాడు. అకస్మాత్తుగ గానధ్వని ఆగిపోయింది. నావ భిక్షువున కభిముఖంగా రాసాగింది.

నావలోనుంచి వాసవదత్త చకితయై గట్టిగ అరచింది. "భిక్షూ! ఏమిటి చేస్తున్నావు? ఈ హింసా పశువు జీవనలాభాన్ని పొందిన తర్వాత, తన ప్రాణదాతను సైతం అతని ప్రాణాన్నే బలిగోరుతుందని నీకు తెలియదు కాబోలు. యిది నిన్ను సర్వనాశనం చేస్తుంది." ఉపగుప్తుడన్నాడు "రమణీ! నీవు పొరబడుతున్నావు బాహ్య సౌందర్యహింసా పశువులకన్న యిది భయంకరమైనది కాదు. దేనివైతే మాటునుంచి మానవుడు తన శత్రువును సర్వనాశనం చేయ ఆకర్ణాంతం నారినిలాగి ఉంచుతాడో అట్టి భయంకర సౌందర్యమూర్తి కాదిది. ఇది సుందరమైన మోహామువంటి భయంకరమైనది గాదు. ఏదైతే తన బంధనాలతో మానవుని బంధించినదో చేతిలో స్వర్ణమకుటాన్ని ఉంచుకొన్న ఛాయాసమానమైన నిస్సార లోభలాలసకన్న అధికమైనది కాదు. దేని వెనుకనైతే మానవమాత్రుడు తనధ్యేయాన్ని ధర్మాన్ని విడిచి అనంతజన్మల్లో - జగత్తులలో తిరుగుచున్నాడో."

వాసవదత్త యిదుమంతయు అర్థము చేసికొనలేకపోయినది. ప్రేమాధోరయై ఆమెపల్కింది -

"భిక్షూ! నీకై ప్రతీక్షిస్తూ ఉండిపోయాను. కానీ నువ్వురాలేదు. మరచిపోయావా?"

ఉపగుప్తుడు : లేదు, నేను వస్తాను కొన్నాళ్లు గడచాక వస్తాను.

వాసవదత్త: భిక్షూ! నేడేరా. ఇంతకంటె సౌందర్యావసరం మరల ఎప్పుడు వస్తుంది! నేను శరత్కాల శశికాంత కాంతులు యీగంగాజల నీలోత్తుంగల హారులమీద నాట్యమాడుతున్నాయి. దీని మీద నువ్వు నాతోవచ్చి నా హృదయ గృహాంధకారాన్ని దూరంచేయి.

"ఆగు" అంటూ భిక్షువు సింహహృదయంనుంచి బాణాన్ని బయటకు తీయబోయాడు.

వాసవదత్త: నీవు నన్ను నీతీక్ష్ణ సౌందర్య బాణంతో కొట్టావు. ముందు నాకు ప్రాణం దానం చేయి.

ఉపగుప్తుడు : సుందరీ! ధైర్యం వహించు నేను తప్పకవస్తాను.

వాసవదత్త : ఎప్పుడు వస్తావు? నీకై ప్రతీక్షిస్తూ నా నేత్రజ్యోతి అరిపోయిన తరువాత నాయౌవనం నన్ను విడచి దూరమైన తరువాతనా? నువ్వు నన్ను కలుసుకొనేది?

ఉపగుప్తుడు ఆమెవైపుచూస్తూనే ఆలోచించాడు. యిదేమిటి? జ్ఞానపంథురాలైకూడ యిలా వాసనామయ కూపమున పడిపోవుచున్నది.

"ఎప్పుడు వస్తావు" మరల ప్రశ్నించింది.
ఉపగుప్తుడు : "ఈ జీవితంలోనే"
వాసవదత్త : అవధి చాలపెద్దదే"
ఉపగుప్తుడు : "అయితే కమి"
వాసవదత్త : "తక్షణమునిచెప్పు"
ఉపగుప్తుడు : "వీలేదు"
వాసవదత్త : "ఈమాసంలో"

ఉపగుప్తు : "ఈసంవత్సరంలో వస్తానులే. ఈ మాట సత్యమునినమ్ము.

వాసవదత్త : నేను నీరాకకై ప్రేళ్లమీద రోజుల్లో వ్యాసల్ని క్షణాల్ని కూడ లెక్కిస్తా.

వాసవదత్త వెళ్ళిపోయింది. ఉపగుప్తుడు మృతప్రాయ సింహహృదయంనుంచి బాణాన్ని తీయటంలో నిమగ్నుడయ్యాడు.

## 3

శరత్ గడచింది. శిశిర ఋతువు దాటింది. హేమంత మదృశ్యమైంది, కానీ ఉపగుప్తుడు రాలేదు. వాసవదత్త అనేక పర్యాయాలు అశ్రుపూర్ణ నేత్రాలతో నిరీక్షించింది, కానీ అతడురాలేదు. అనేక సార్లు అంగాంగాల్ని అప్సరసలకన్న మిన్నగ అలంకరించుకుంది. కానీ అంతావృధా ప్రయాస అయిపోయింది.

సుమనాలను, సుగంధులను సంజీవనిని తీసికొని వసంతంవచ్చింది. అయినా అతడురాలేదు. చూస్తుండగనే గడువు మీరేరోజులు రాసాగాయి. అయినా అతడు రాలేదు. వాసవదత్త అతృప్త, అశాంత నయనాలతో ఎన్నడూరాని బాటసారికోసం నిరీక్షిం

చూట మానలేదు. కానీ తన హృదయాంతరత ప్రేమా వల్లభుడు మాత్రం రాలేదు.

గడువు పూర్తికావడానికి రెండేమాసాలు మిగిలి నాయి: ఇక ఒకనెలమాత్రం మిగిలి జారిపోతూంది. ప్రాకంచిక పాంథనివాసంలో బసచేసిన పథికుడు వర్షఋతుపోకడకై నిరీక్షణసాగించాడు. అతడు శిరకంబళిని బుజంమీద వేసికొన్నాడు. హేమం తపు ఛాయ్యాకు బంధించాడు. వసంతంపు పూవనాలను సంభాళించాడు. గ్రీష్మకాలపు ఆతపత్రాన్ని హస్తం లోను, పాదరక్షల్ని కాళ్ళకు తగిలించాడు. అతడు తన అంతిమ వస్తువైన శరత్చంద్ర చంద్రికలు ప్రోగు చేయ చేతులు చాచాలేదో ఆ క్షణంలో వాసవ దత్త వికల స్వరానపల్కింది "నా ప్రియతము డీవర్ష రానికి రాడా?"

రాత్రిసమయం సమస్తపృథ్వి అంధకారమందు విలీనమైంది. వాసవదత్త భవనం సహస్రాలోక మాలాలంకృతమై దేదీప్యమానంగా ఉంది. జ్యోతి ర్కిరణాలు ఆమె స్వర్ణభూషణాలలో ప్రతిఫలించి ఆమె విలాసకక్ష్యాని కపూర్వశోభను సమకూర్చు చున్నవి. అసంఖ్య జ్యోతుల్లో చంద్రునిలా వాసవ మెరుస్తూంది.

ఆనాడు వాసవదత్త గృహంలో వుత్సవం. ఆ ఉత్సవం ఆమె ప్రేమకు దాసుడైన లక్షాధికారి ఒకడు, వాని స్వాగతార్థమేర్పాటయినది. సంగీత ధార లోతైపుని తెరొక్కైపుని సురాధారాలు ప్రవహిస్తున్నయి. వాటి మధ్య లక్షపతి, అభాగ్యు డైన లక్షపతి మునిగి తేలుచున్నాడు.

అర్ధరాత్రము కాకమున్నే లక్షాధికారి సురా ధీనుడై మాదకత్వంలోపడి కనిమీలిత నేత్రుడయ్యేడు. అచేతనుడయ్యాడు. అతనికి తన పర భేదం తెలియటం లేదు. సంగీత ఝురిఆగింది. పరిచారికాదులు సెలవు తీసికొన్నారు. కక్ష్యయందు వాసవా లక్షాధికారులు తప్ప వేరెవ్వరులేరు... కాదు... వేరొక జైపాకి పిశాచిన కూర్చొని ఆమె ఎవరు? వేశ్యావాసవదత్త యొక్క పంచ్ఛాయ.

వాసవదత్త నల్దిశలా పరికించి తలగడక్రింద దాచి యున్న కైజారును వెలికి దీసింది. ఈ అర్ధరాత్రమున వేశ్యచేతిలో కైజారా!!? ఆమె ఏమిచేయాలను కుంటూంది. ఏహృదయమునుంచి సంగీతధారలు ప్రవహించునో ఆహృదయమిట్టి పాడుపనిచేయ సంకల్పించునా?

ఆమె ఆ లక్షాధికారి ఆ చేతన శరీరాన్ని వధించ ముందుకు రాసాగింది. ఆమె ఖడ్గయుతహస్తం యింకా పైకిలేచింది. "జాగ్రత్త! పైన పరమే శ్వరుడున్నాడు! కాస్త భగవద్భక్తి ఉంచు! అన్నట్లు పల్కినవాకత్తి? ఆ మూగచెయ్యి ఆసంకేతాన్ని గుర్తించజాలకపోయినది. ఆకైజారు లక్షపతి వక్షం లోనికి నిశ్శబ్దంగా దింపబడింది. ప్రాణాల్ని విడుస్తూ లక్షపతి "హా వాసకాంతి! పిశాచినీ" యినే లక్షపతి అంత్యపలుకులు.

రూపవతిరాక్షసి — కుసుమాకర పిశాచిని తన విజయానికి ప్రసన్నగాలేంది. ఆ దేసమయంలో భిక్షువు కరుణాపూరిత కంఠంతో పిలచాడు. "వాసవ దత్తా!" కంపిత వాసవదత్త గవాక్షకవాటాన్ని తెరచి పల్కింది,

"ఎవరు" సమాధా నావశ్యకత లేకపోయినది గవాక్ష ద్వారంగుండాపోయిన కాంతిరేఖలు ఆ మూర్త్యవ్యక్తి వదనం కమలంమీద చిందులు త్రొక్కాయి, అతడెవ్వరో కాదు "ఉపగుప్తుడు!!"

వాసవ హర్షపూర్వకంగా "భిక్షూ!! నీవు. వచ్చావా!!!" అంది.

"లేదు! శీఘ్రంగా వెళ్లిపోతాను." సమాధాన మిచ్చాడు భిక్షువు.

"ఈ సమయంలో రాకకు కారణం"

"ఏమీలేదు నేను ఆరామానికి వెళుతున్నాను. యిక్కడకు వచ్చేసరికి నీవు మేల్కొన్నావో లేక నిద్రిస్తున్నావో? తెలుసుకుందామనే ఉత్కంఠతో వచ్చాను.

"నేను మేల్కొనేఉన్నాను"

"కానీ నీ నేత్రయుగళం మూసుకొంటూంది సరే నే వెడుతున్నా! నేడు నాకు చాలా ఆలస్యమై పోయింది"

"ఆగు నీవు నీప్రతిజ్ఞ జ్ఞాపకముందా"
"ఆ!"

"నీవీ సంవత్సరంలోనే నన్ను కలసికొంటానని మాటయిచ్చావు"

"యింకా ఎన్ని నాళ్లు గడువున్నది"
"ఒక పక్షంమాత్రం"
"నేను అవశ్యం ఆలోగా కలవస్తా"

"నీవు అబద్ధాలాడి నన్ను మోసగించాలని చూస్తున్నావు"

"అమితాభుని శిష్యుడెన్నటికి అసత్యమాడడు. మోసగించుటాతని ధర్మమే కాదు"

ఉపగుప్తుడు రజనీ గంభీరాంధకారంలో అదృశ్యుడైపోయాడు. వాసవ గవాక్ష ద్వారాన్ని బంధించి దాగున్నది.

4

వాసవదత్త ధనంకోసం లక్షాధికారిని చంపించదన్న రహస్యం వెల్లడైపోయింది. న్యాయాలయంలో విచారణాగ్రం ఉపస్థిత కావింపబడింది.

ఆమెధనం ఆమెకు ఉపయోగపడలేదు, ఆమె ప్రేమికు లెవ్వరు ఆమెకు సాయపడలేరు. ఆమె అనుపమ సౌందర్యము ఆమెను శిక్షనుంచి విముక్తను గావించలేకపోయినది.

హతభాగినికి న్యాయాలయంలో ఉరిశిక్ష లభించలేదు. ప్రాణదండన ఆమె అశాంత జీవితానికి శాంతిప్రదమైనది. అది వాస్తవానికి లభిస్తే శిక్షయే కాదు. ఆశీర్వాదమా చెప్పాలి. ఆమెరూపము కురూపము గావించబడింది.

పూర్ణచంద్రబింబమువంటి ఆమె ముఖబింబము నుండి కమలపురేకులవంటి కండ్లూడ పెరికాట.

శిరీషపుష్పముల కర్ణాలను, నూవుపూవువంటి ఆమె నాశికను వినాశం గావించారు.

మృణాల కరాలను ఛిన్నంచేశారు.

ఆమె ధనసంపదలు హస్తగతం చేసికొన్నారు.

వాసవదత్తకి శిక్షలభించిన సమయంలో ఆమె కరుణాపూరిత స్వరంతో న్యాయాధిపతులను ప్రార్థించింది "నాకొక అర్ధపక్షము అవకాశము యిప్పించుడు, నేనొక ప్రేమికుని కలసికొనవలె అతడే వారంలోగా తప్పకవస్తాడు. ఆ తరువాత సంతోషంతో మీశిక్షను శిరసావహిస్తాను.

ఎవ్వరూ ఆమె ప్రార్థనను లక్ష్యపెట్టలేదు. ఘాతకుడామెను కురూపిగా కుత్సితనుగాచేసి రాజవీధులలో ఆమెను నిలబెట్టి ఆమె పాపకార్యాల్ని వర్ణించాడు.

ఎట్టి భయంకర బీభత్సదృశ్యం! క్షతాలనుంచి చీమూ, నెత్తురూ మిశ్రితమై కారజొచ్చాయి. వాటినిండ ఈగలు, దోమలు ముసిరి ఆమెను బాధిస్తుంటే వాటిని తోలుకోడానికి హస్తహీనరాలైన ఆహతభాగిని కరుణస్వరాన ఏడుస్తోంది.

ఇప్పుడామెదగ్గర పూర్వపు యువ్వనాదులుకానీ సంపద కానరాదు. అట్టి దుర్దశలో ఆమెజీవితం భారవహ శకటాన్నిలాగె జంతువు కంఠశ్రమ పడుతవో వాటికి కట్టించిన శ్రమతో గడుస్తోంది. అట్టి దుర్దశలో ఉపగుప్తుడువచ్చి సానుభూతి పూర్వకముగ తలనిమిరాడు.

"ఎవ్వరు" ససంభ్రమముగ అడిగింది.

"నేను" గభీరజలధి సమాధానమిచ్చింది.

ఆ గంభీర కంఠస్వరము ఉపగుప్తుడిదని వాసవ గ్రహించింది.

కాని తన భ్రమతొలగించుకొనుటకు మరల ప్రశ్నించింది:

"నీవా! ఉపగుప్తునివా!"

"ఔను! ఉపగుప్తుడనే"

"తిరిగిపో! నీవెందుకువచ్చావ్? నన్ను పరిహసించుటకా" నిట్టూర్పుతో అంది. నీవు నన్ను తిరస్కరిస్తున్నావ్, నిచ్చిన మాటప్రకారం గడువు యింకను రెండురోజులుండగనే నేను వచ్చాను."

విగాశతో మంత్రంగా వాసవ నోటివెంబడి ఈ మాటలు వచ్చాయి.

"నాయీ దేహం నవ్యవసంత శోభలతో శోభిల్లినవాడు, నాశోభాచంద్రుడు పృథ్వపై కిరణప్రసారం చేసినవాడు, ఘాతకుడు ప్రఖరశిలపై ఖడ్గానికి పదును పెట్టునప్పుడుకూడా నీవురాలేదు. నీయంతి అబోధుడవా భిక్షూ! నాసౌందర్యజ్యోతి ఆరిపోయింది నాశోభా సూర్యుడస్తమించాడు. ఇట్టి సమయంలో నీవెందుకై వచ్చావు?"

ఉపగుప్తుడు: సోదరీ! నేను యింద్రియ సుఖార్థిపైకాని మరే స్వార్థంతో కానీ రాలేదు. శారీరక సౌందర్యం వ్యర్థమైంది. దానికి నీశరీరమే సాక్షి. ధనసంపదలు నిస్సారమైనవి. దానికి సమాధానం నీఅతుల ఐశ్వర్యమే. నేను నీదగ్గరకొచ్చాను. ఏమి చెయ్యాలో చెప్పు.

వాసవదత్త జ్ఞాననేత్రాలు తెరవబడినయ్. ఆమె పల్కింది.

"భిక్షూ! నేనేం చెప్పగలను? నీయీ ప్రశ్న నా సమాధానాన్ని దొంగిలించింది. నేనొక స్వప్నము వెనుక, ఒక ఛాయ వెనుక, ఒక మరీచిక వెనుక పరుగులిడుతున్నానని నాకిప్పుడు జ్ఞాతమౌతూంది. నేచెప్ప వలసినదేమీ లేదు. నీవు నా సామీప్యమున నేయుండుము. నీ [illegible] తున్నాయి. నీమధుర వచనాలు నా సంతాపాన్ని తగ్గిస్తున్నాయి.

భిక్షుశ్రేష్ఠా! నీవు మరికొన్ని మాటలు చెప్పు"

ఉపగుప్తుడు: [illegible] దుఃఖాలకు హేతువు తృష్ణ. నీ తృష్ణను [illegible] పరుగులిడినావు. నీవు [illegible] ధర్మాన్ని విక్రయించి అశాశ్వతమైన ధనార్జనకై [illegible] హత్య చేసినావు. ఈ నీ దుఃఖాన [illegible] నీకు [illegible] లేకపోయిరి.

వాసవ: హా! భిక్షూ! నీవింతకు మున్నే నన్నీ పాపపంకిలాన్నుండి ఎందుకు రక్షించలేదు; నన్నుద్ధరించుటకు చాల ఆలస్యంగా వచ్చావు.

ఉపగుప్తుడు: ఏమాత్రం ఆలస్యం కాలేదు. వలసినంత వ్యవధియున్నది. నీవిపుడు బాహ్యసౌందర్య హీనురాలవు. కానీ నీ అంతరంగిక జ్ఞాననేత్రాలు విడివడ్డాయి. లే! బోధిసత్వుని సహాయమర్థించు, నీ దుఃఖాలు దూరం అవుతాయి.

వాసవదత్త ఒకమారు ప్రపంచంలో ఆకారాన్నుంచి [illegible] దృష్టిసారించింది. ఆమె సుషుప్తమైన సాత్విక ప్రవృత్తి మేల్కొన్నది. ఆమెకు ప్రాపంచిక క్షణభంగురత జ్ఞాతమైంది. జ్ఞాతమగుటయే కాదు. అనుభవము కలిగినది కూడ. ఆమె భిక్షు చరణాలలో మస్తకాన్నుంచి పల్కింది. భిక్షూ! నేను సిద్ధంగా ఉన్నాను. నన్ను తీసికొనిపో, నన్నీ గర్వాంధకార దుర్గంధభూయిష్ట అజ్ఞాన ప్రపంచాన్నుంచి కాంతిలోకానికి తీసికొనిపో!

భిక్షువు తన పవిత్ర కరాలతో ఆమెను స్పృశించాడు. ఇద్దరూ సంఘారామం వైపు నడచారు.

పాపతాపంతో దగ్ధమైన వాసవ సురసరిలో స్నానం చేసింది. ప్రవజ్యాగ్రహణం పొంది శేషజీవితాన్ని శాంతంగా గడపింది.

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
ఆంటోని డెసయింట్-ఎక్స్యుపెరే

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ

## జాగ్రఫీ మనిషి లోకం!

[రాజకుమార్ మరో గ్రహమండలంనుంచి వచ్చిన అబ్బాయి. ఇక్కడికి వచ్చీ రావటంతోనే, విమానం చెడిపోయి ఎడారిలో దిగిపోయి యంత్రాన్ని మరమ్మత్తు చేసుకోటంలో ఉక్కిరిబిక్కిరయిపోతున్న పైలటుతో పరిచయం కలిగింది. వాడి లోకపుతీరు వేరు. పైలట్ లోకపుతీరు వేరు. అబ్బాయి ఆయనకి తనలోకపు సంగతి గుక్కతిప్పకుండా చెప్పుతూ, చెప్పుతూ తనకి తనచుట్టుపట్లనున్న గ్రహమండలాలని చూసిరావాలని కోరిక కలిగిందని అన్నాడు. తన కోరికని కొనసాగించుకోటానికి తను ఎలా ప్రయాణాన్ని సాగించిందీ, దోవలో తను చూచిన గ్రహమండలాలు ఎటువంటివో అక్కడవుండేవాళ్లు ఎటువంటివాళ్ళో వివరిస్తూవున్నాడు. ఇంతవరకు అయిదు మండలాలని చూశాడు. మొదటిదానిలో రాజా వున్నాడు తన రాజఠీవితో మరెవళ్లూ తన దగ్గరలేకపోయినా. రెండోదాన్లో వున్నాయనదంభాచార్లు! అందరూ తనని పొగడాలని ఆయన ఆశ. మూడోదాన్లో వుండే మనిషి తన కష్టాలని మరచిపోడానికి అస్తమానం తాగుతూ వుంటాడు. నాలుగో దాన్లో లక్షలని, కోట్లని లెక్కపెట్టే వర్తకుడు వుంటాడు. అయిదో మండలంలో వుండేది దీపాలమనిషి. వాళ్ళంతా ఒంటరిగా వుండిపోవాలని వచ్చినా వూపిరి పీల్చుకోటానికి వాళ్ళకి వ్యవధి అన్నమాట వుంటేగా! వాళ్ళ గొడవ వాళ్లది. వాళ్లని ఎలాగో వదిలించుకుని ఆరో గ్రహమండలంలోకి రాజకుమార్ ప్రవేశించాడు. ఇక చదవండి.]

రాజకుమార్ ఇప్పుడు ప్రవేశించింది ఆరో గ్రహమండలంలోకి. ఇది ఇంతకు ముందు చూసిన గ్రహమండలాల కన్నా పదింతలు పెద్దది. దాన్లో వుంటున్నాయన పని ఒక పెద్ద గ్రంథాన్ని ముందుపెట్టుకోటం, దాన్లో ఏదో బరబరా వ్రాస్తూ వుండటమే.

అబ్బాయి అటుకేసి రావటం దూరాన్నుంచే ఆయనచూశాడు. తను చేస్తున్న పని ఒక్కనిమిషం ఆపేసి, అబ్బాయిని తన దగ్గరికి చేరదీస్తూ "నువ్వు ఇలారావటం చూస్తే గ్రహమండలాల రహస్యాలని పరిశోధించటానికి వచ్చినట్లు కనబడుతున్నదే!" అంటూ ప్రక్కనే కూర్చోటానికి స్థలాన్నిచూపాడు. కూర్చోటమే తరవాయి అబ్బాయి ఆవలించటానికి మొదలెట్టాడు. ఎంత ఆపుకోవాలని ప్రయత్నించినా లాభంవుంటేగా! ఆయన వారిని ఏదో అడుగుతున్నాడు. ఆ మాటని సావధానంగా వినే స్థితిలో వుంటేగా ఆ సమయంలో... ఎలాగయితేనేం కొంతసేపటికి తేరుకుని నలువైపులా చూశాడు. ఆయన ఆయన పనిలోమునిగి పోయాడు. ఎటు చూచినా పుస్తకాలు! అవీ ఆయన ముందున్న పుస్తకం మల్లె బ్రహ్మాండమైన గ్రంథాలే. వాడు ఎన్నెన్నో చోట్లని చూశాడు. కాని ఇంతపెద్ద పుస్తకాలని ఎక్కడా చూడలేదు. ఉన్న పుస్తకాలతో తృప్తిపడక ఎందుకు మరోదాన్ని ఇలా వ్రాయటం? ఈయన రాజు కాదు. వర్తకుడు కాదు. కూలినాలి చేసే మనిషి కాదు.

ఎంత ఓపిక! ఇంత ఓపికగలాయన ఎవరై వుంటారు?......

అబ్బాయి ఆయనకేసి ఆత్రుతతో చూస్తూ "ఇంత పుస్తకం వ్రాయటం ఎందుకు? ఇంతకూ మీరెవరు!" అని అడిగాడు.

"నేను జాగ్రఫీ మనిషిని. నాపనంతా జాగ్రఫీని వ్రాయటమే!" అని వాడికేసి చిరునవ్వుతో చూస్తూ అన్నాడు.

"జాగ్రఫీ అంటే ఏమిటో చెప్పరూ?" ఆయన అనేమాట అర్థంకాక అబ్బాయి తికమక పడుతూ ఆయన్ని ప్రశ్నించాడు.

"అంటే అదొక పెద్ద శాస్త్రం అన్నమాట. దాన్లో సముద్రాలనిగురించి నదులని గురించి పట్టణాలనిగురించి, కొండల్ని గురించి, అడవులు, ఎడారులనిగురించి ఎంతో భోగట్టా తెలుసుకోవచ్చు ......
..."అని ఆయన జవాబిచ్చాడు.

"అలాటి సంగతులని తెలుసుకోటం అవసరమే. వాటిని సేకరించటానికి జాగ్రఫీ మనుష్యులు ఎంతో తెలివి తేటలు కలవారై వుండాలి. ఎంతో అనుభవాన్ని సంపాదించిన వారై వుండాలికూడా." అని అంటూ అబ్బాయి ఆయనకేసి ఒకసారి, ఆయన చుట్టూవున్న పుస్తకాలకేసి మరొకసారి ఆ పెద్దగ్రహమండలాని కేసి ఇంకొకసారి విస్తుపోతూచూశాడు.

"మీ గ్రహమండలం ఎంతో బాగా వుంది. దీన్లో కూడా సముద్రాలు వున్నాయా?" అని అడిగాడు అబ్బాయి.

"అది నాకేం తెలుస్తుంది?"అని జాగ్రఫీ మనిషి అన్నాడు.

"అలాగయితే కొండలో?".

"ఆ సంగతీ నాకు తెలియదు."

"మీరు జాగ్రఫీమనిషి అని అన్నారుగా? ... అది పోనీయండి. పట్టణాలు నదులు అడవులూ ..." అని అబ్బాయి అడిగబోయాడు. వాడి మాటకి అడ్డువస్తూ ఆ సంగతులూ నాకు ఎలా తెలుస్తాయని అనుకుంటావు?" అని తలని అడ్డంగా త్రిప్పుతూ జవాబిచ్చాడు ఆ శాస్త్రజ్ఞుడు.

"అయితే మీరు జాగ్రఫీని క్షుణ్ణంగా తెలుసుకున్న శాస్త్రజ్ఞులని అన్నారుగా!"

"అన్నమాట నిజమే. ఆ గొడవనంతా చూసుకునేవాళ్లు పరిశోధకులు నా వంటి శాస్త్రజ్ఞులకి దాన్నంతా చూసుకుంటుంటే ఇలాపుస్తకాలని వ్రాయటానికి వీలు ఎలా వుంటుందనుకొంటావు? మా వంటివాళ్ల పని రాత్రింబగలు బల్లలముందర కూచోటం, ఇటుకేసివచ్చే పరిశోధకులని దగ్గరకు చేరతీయటం, వాళ్ళు చెప్పేవాటిని శ్రద్ధతో వినటం, పుస్తకంలో వాటిని ఎక్కించటం. వాళ్లు చెప్పేసంగతులు సరియైనవి కావని అనుకుంటే ఇవిగో ఇక్కడే విడిగావున్న కాగితాలలోకి దించటం... తరువాత నిజమైన భోగట్టాని సేకరించటానికి వాటిని అధికారుల దగ్గరకి పంపటం..." అని తన కార్యకలాపాన్ని గురించి అబ్బాయికి చెప్ప ప్రారంభించాడు ఆ పెద్దపండితుడు.

"అలా చేయటం బాగుంటుందా?" ఆశ్చర్యంతో అబ్బాయి అడిగాడు.

"అలా చేయకపోతే ఎంత ప్రమాదం వస్తుందో నీకేం తెలుసు. పరిశోధకులు ఒక్కొక్కసారి అబద్ధాలు చెప్పి ఈ

శాస్త్రిన్నే తలక్రిందుల చేయవచ్చు. వాళ్ళలో త్రాగుబోతులుకూడా వున్నారు ..."

"అంటే ?" విస్తుపోతూ ప్రశ్నించాడు అబ్బాయి.

"తప్ప త్రాగినవాళ్ళ కళ్ళకిమైకం పడుతుంది. నిజానికి వున్నది ఒకటే అయినా వాళ్ళకి రెండుగా కనబడతాయి. వాళ్ళ మాటమీద గురివుంచి వాళ్లు చెప్పేది పుస్తకంలోకి ఎక్కించానా ఇంకేం వుంది ?" అని శాస్త్రజ్ఞుడు అన్నాడు.

"మీరు అన్నదినిజమే! మీరు అన్నట్లు తెలివితక్కువపనులని చేస్తూవుండే పరిశోధకులలో నొకడ్ని నాకు బాగా తెలుసు"

"నేను అన్నానుగా ఇంతకు ముందే. అలాంటివాళ్లు ఎంతోమంది వుంటారు. వాళ్లు చెప్పేమాటి నిజాయితిని తెలుసుకోటానికే ఇలాటి కాగితాలని పరీక్షార్థంమై అధికారుల దగ్గరకి వెంటనే పంపటం" అని జవాబిచ్చాడు ఆయన.

"ఈ కాగితాలని చూసుకున్నాక అధికారులు ఏం చేస్తారు ?"

"వాళ్ల పని అంతా ఇలాటి పరిశోధకులని తమ దగ్గరకి పిలుపించుకుని ఎన్నెన్నో మార్గాల్లోపరీక్షచేయటమే. ఎవళ్ళో ఒకరు కొండలని కనిపెట్టానని అంటారనుకో. అది ఎంతవరకు నిజమో పరీక్షించటానికి అక్కడినుంచి రాతిరప్పలని చూపమని అడుగుతారను .. " అని తన పని ఎటువంటిదో పరిశోధకులు చేయాలసిన పని ఎటువంటిదో చెప్పటానికి మొదలెట్టుతూ అబ్బాయి కేసి చూశాడు జాగ్రఫీ మనిషి.

"నువ్వుకూడ ఇటు కేసి ఇలా రావటం చూస్తుంటే నువ్వు అలాటి పరిశోధకులలో కబ్బడివై వుండాలి. ... .... నీ గ్రహమండలాలని గురించి కొంత చెప్పవూ ?" అని అబ్బాయిని ప్రాధేయపడుతూ అడుగుతూ, ప్రక్కనే ఇలాటిపనికోసం సిద్ధంగా వుంచుకున్న కాగితాలని ముందుకు లాగాడు. వ్రాసుకోటానికి ప్రక్కనేవున్న పెన్సిళ్ల పెట్టెలోనుంచి పెన్సిలు నొకదానిని తీసుకొని చక్కగా చెక్కి తయారుగా వుంచుకున్నాడు. ఆయన చేసే పని ఇదే ఎవళ్లయినా కొత్తవాళ్ళని ఈ మండలంలో కలుసుకోటానికి అవకాశం దొరికితే. ఆ మనుషులు చెప్పింది అక్షరాలా సత్యమని తెలుసుకున్నాకే ఆ పెద్ద పుస్తకాల్లోకి కలంతో తిరిగి వ్రాసుకోటం.

"సిద్ధంగా వున్నాను ఇక చెప్పవూ ?" అని అబ్బాయిని అడిగాడు ఆ పెద్ద పండితుడు

"ఊ! నేను వుండే గ్రహమండలం అంత చెప్పకోదగ్గ పెద్దది కాదు. ఎంతో చిన్నది. దాన్లో అగ్నిపర్వతాలు మూడు వున్నాయి. రెండు రాత్రింబగళ్ళు విధి విరామంలేకుండా మండుతూనే వుంటాయి. మూడోది ఆరిపోయింది. ఆ రహస్యం ఎవళ్లకూ తెలియదు ... ... " అని అబ్బాయి చెప్పనారంభించాడు.

"అగ్నిపర్వతాల తత్వం అటువంటిదే" అని ఆయన అన్నాడు.

"నాకొక పువ్వుకూడా వుంది."

"పూల సంగతి వ్రాసుకోటం మా పని కాదు. అవివుండేది కొంతకాలమేగా!..." అని జాగ్రఫీ మనిషి అమాయకంగా చెప్పాడు.

"అలా అంటారెందుకు? పూలు ఎంత సొగసైనవో ...."

"అయినా ఆ జాతి తాత్కాలిక జాతికి సంబంధించింది."

"అంటే?" విస్తుపోతూ అబ్బాయి ఆయన్ని ప్రశ్నించాడు.

"జాగ్రఫీపుస్తకాలు శాశ్వతంగావుండి పోయేవాటిని గురించే చెప్తాయి. ఒక కొండసంగతిచూడు. అది వున్న చోటినుంచి కదలి పోవటం అసంభవం. సముద్రం కూడా అంతే. ఈ జన్మలో దాన్లోని నీళ్లు ఎండి పోవటం అనేది వుండదు. శాశ్వతంగా వుండేవి. అవే మాకు కావాలసింది."

"అలాగయితే ఆరిపోయిన నామూడో అగ్నిపర్వతం సంగతో? అదే మరి కొంత కాలానికి తిరిగి మండవచ్చు. అలాటిదానిని దేన్లోకి చేర్చుకుంటారు?" అని ఆందోళన పడుతూ అబ్బాయి అడిగాడు.

"అవి మండుతూవున్నా, మండక పోయినా కొండల జాతికి సంబంధించిన వేగా! అంచేత కొండలకి మల్లె లెక్క లోకి తీసుకుంటాం"

"అలాగయితే నా పువ్వు మీ దృష్టిలో పనికిరాదన్నమాటేనా?" ముఖాన్ని చిన్నబుచ్చుకుంటూ అబ్బాయి నూటి ప్రశ్నని వేశాడు.

"ఆ! తప్పక" అని ఆయన అన్నాడు.

ఈ జవాబు అబ్బాయికి ఎలా నచ్చుతుంది? తనప్రాణానికి సమానంగా చూసుకుంటున్నాడు అబ్బాయి ఆ పువ్వుని. బయటి వాళ్లు దానిని ముట్టి పాడుచేయకుండా వుండటానికి వాడియైన ముళ్లు దానిచుట్టూ వున్నాయి ... అది ఇప్పుడు ఇంట్లోవుంది. ఈయనఅన్నట్లు నిజంగా తాత్కాలికమే అయితే పర్వతాలకి, సముద్రాలకి మల్లె కాక......

ఆ ఆలోచనలు తరుముతూ వాడ్నిఉక్కిరి బిక్కిరి చేస్తూవున్నాయి. తన భయాన్ని, ఆందోళనని పైకి కనపరచకుండా వుండటానికి ప్రయత్నిస్తున్నాడు. ఇక అక్కడ వుండటం అబ్బాయికి ఇష్టంలేదు అంగ చులకనగా తన పువ్వుని ఆయనచూస్తున్నందుకు.

ఆయనకేసి చూస్తూ సంభాషణని మారుస్తూ "ఇంతదూరం ఇక్కడికి వచ్చానుగా. ఇక్కడినుంచి ఎక్కడికి వెళ్ళటం మంచిదో మీరేచెప్పాలి" అని అన్నాడు.

"తిన్నగా భూలోకానికి వెళ్ళటమే మంచిదని నా సలహా ... ఆ లోకానికి పేరు ప్రఖ్యాతులు వున్నాయి ...." అని ఏమో అనబోతున్నాడు ఆ పండితుడు.

అక్కడకే తిన్నగా నడవటం మంచిదనుకుంటూ, రాజకుమార్ ఆయన దగ్గర సెలవు పుచ్చుకుని బయలుదేరాడు. అలా వెడుతూవున్నప్పుడు వాడి ధ్యానమంతా వాడి పువ్వుమీదే!

—o—

# చీకటి — వెలుగు

శ్రీ నేతి శ్రీరామచంద్రమూర్తి

పెళ్ళికట్ట డ్రాయరుమీద పడేసి శంకరం తల్లి వంక చూశాడు. ఆవిడ తలవంచుకుని మూటలు కడుతున్నది.

"ఏమిటమ్మా, ఎక్కడికి ప్రయాణం?" అన్నాడు.

నిశ్శబ్దాన్ని చీల్చుకువచ్చిన శబ్దంవిని వెనక్కి తిరిగి చూసింది. మళ్ళీ వెంటనే తలవంచుకుని తనపని చేయసాగింది.

"ఏమైందే మళ్ళీ?" శంకరం విసుగ్గా అన్నాడు.

"నాయనా నీపెళ్ళాం చేతిలో వేగలేనురా నేను. ఇంత ఇదామరీను. పెద్దదాన్నిగదా! ఎందుకొచ్చిన గొడవ? ఉదయాన్నే బండిఎక్కించు పోతా! ఎన్నటికైనా నావాడేగా నాగొంతులో తులసినీళ్ళు పోసేవాడు. ముందరే తెలుస్తున్నది అమ్మగారి సంగతి. ఇక కాలు చెయ్యిపడితే ముఖంకూడా చూడదు." అంది కొడుకుతో.

శంకరం సరోజవైపు చూశాడు. ఆమెకళ్ళనుంచి నీళ్ళు కారుతున్నాయి. శంకరం నిట్టూర్చాడు.

లోపలికి పోయాడు శంకరం. సరోజ అతన్ని అనుసరించింది.

"ఊరుకో సరూ! ఆవిడ విషయం నీకు కొత్తగాదుగా!"

సరోజ వెక్కి వెక్కి ఏడుస్తున్నది.
"జరిగిందేమిటో?"

"ఏమైందీ, ఏదో తప్పుచేసినా సర్దుకుపోవాలిగానీ, ఇలా అల్లరిచేస్తే ఎలా?" అంది బాధగా సరోజ.

శంకరం జాలిగా భార్యవంక చూశాడు.

అతనికి సరోజ మనసు పూర్తిగా తెలుసు. తల్లి మనసూ తెలుసు ఏం జరిగిందో తెలియకపోయినా భార్యని బాధారహితురాలిగా చెయ్యటానికి అన్నాడు.

"ఊరుకోసరూ! ఆవిడ బ్రతికినంతకాలం బ్రతకదు. ఆనాలుగురోజులూ కళ్ళుమూసుకుంటేసరి, మంచిదానవంటారు."

"రోజూ చెయ్యటంలేదూ ఆవిడ అడిగిందల్లా ఈరోజేగా చెయ్యనిది. అందుకని మూడు ప్రాణాలను పస్తుపడుకోబెడుతుందా? చూడండి! పొద్దున వండినఅన్నముకూర అలాగే ఉన్నాయి. నీళ్ళు కాయలు మీరు భోజనం చెయ్యకుండా వెళ్ళిపోయారు?" అన్నది బాధగ.

శంకరం జాలిగ చూస్తున్న భార్యమొహం పైకెత్తిచూశాడు.

"ఏదో పెద్దతనం. ఏంచేస్తాం?" అన్నాడు.
శంకరం మళ్ళీ సావిట్లోకి వచ్చాడు.

"ఊరుకో అమ్మా, నీకోడలి సంగతి నీకుతెలీదు? ఇదివరకల్లా నీవన్నదల్లా చేసిపెట్టలా? తప్పుచేస్తుందితే వంకాయకూర." అన్నాడు తల్లితో!

"ఆ! అడిగినవన్నీ చేశారు ఇంతకుముందు? ఇక ముందుచేస్తారు?" అంది సాగదీస్తూ.

"పోనీయమ్మా. అది చిన్నపిల్ల తెలీలేదు గాబోలు" అన్నాడు శంకరం.

"తెలీదుట తెలీదు. ఈయనగారు ఆవిడగార్ని వెనకేసుకువస్తున్నాడు. ఆహాహా...ఏమి అనుకూల దాంపత్యమండి. అత్తగారికదా ఆమాత్రం భయభక్తులుండక్కర్లా?"

శంకరం మాట్లాడలేదు.

"ఎందుకులే నాయనా? దానికిలాగూ నేనుండటం ఇష్టంలేదు. పోయొస్తా. పొద్దున్నే నాతో వచ్చి కాస్తబండి ఎక్కిస్తివా నీకింత పుణ్యం ఉంటుంది. కొడుకులు తనవాడైతే కోడలు తనదవుతుందా? ఎంతయినా పరాయి పరాయే!"

"ఉండమ్మా. దాని మొహం దాని మాటలకి నువ్వెళ్ళిపోవటం ఏమిటి?" అన్నాడు శంకరం.

"ఆ చిన్నపిల్లా? ఇరవైఏళ్ళు నెత్తిమీదకున్నాయి,

నాలుగేళ్ళనుంచీ కాపరం చేస్తున్నదీ ఇలాగేనా మాట్లాడటం ?" అంది తల్లి కాస్త ఘాటుగా.

"ఉండండత్తయ్యా ? నాదే తప్పు. నన్ను క్షమించండి" అంది సరోజ మీనాక్షమ్మగారి కాళ్లు పట్టుకుని.

"ఉండనమ్మా !" అంది మీనాక్షమ్మగారు.

"ఉండమ్మా, నిన్ను బతిమాలుకుంటాను ఉండు" అన్నాడు శంకరం.

"ఉండనురా ! వాడు, అదీ ఉత్తరాలమీద ఉత్తరాలు వ్రాస్తున్నారు—రమ్మని, ఒకసారిపోయి చూసివస్తా."

ఇక తల్లి నాపటం తన తరంకాదనుకున్నాడు శంకరం.

"సరే, నీ ఇష్టం" అన్నాడు.

శంకరం తండ్రి సూరయ్యగారు ప్రథమ కళత్రం లక్ష్మమ్మగారు శంకరాన్ని ప్రసవించిపోయింది ఈ లోకాన్ని విడిచి. సూరయ్యగారు మీనాక్షమ్మగారిని ద్వితీయ వివాహం చేసుకున్నారు. ఆవిడ మూడేళ్ళు శంకరాన్ని సరిగా సాకింది. తరవాత ఆమెకి గోపాలం పుట్టాడు.

ఇంతలో సూరయ్యగారికి గుండె జబ్బు వచ్చింది. "నా కొడుక్కి అన్యాయం చేస్తారు." అని మీనాక్షమ్మగారి ఏడుపులకి పడలేక సూర్యయ్యగారు ఉన్న పదిహేను ఎకరాల మాగాణి పొలం, ఇల్లు మీనాక్షమ్మకి చెందేటట్లు వ్రాశారు.

సూరయ్యగారు కళ్లుమూశాడు. పోతూపోతూ శంకరాన్ని చాటుగ పిలిచి, "మీ నాన్న నీకేమి ఇవ్వటంలేదు శంకరం. నీ కాళ్ళమీద నువ్వు నిలబడు మీ నాన్న ఆత్మ శాంతిస్తుంది. అది నీకేమి ఇవ్వదు. వాడసలు లాభంలేదు ! ఎప్పుడూ వాడికి డబ్బులిస్తుంది అడగంగానే. అదే వాడిని చెడగొడుతున్నది. నువ్వే మీ అమ్మకి ఆధారం. నువ్వే దాన్ని పోషించాలి. మంచివాడివనిపించుకో" అన్నాడు.

శంకరం "అలాగే నాన్నా ! మీరు చెప్పినట్లే చేస్తాను." అన్నాడు చిక్కిపోయిన తండ్రి అరచేతి మీద తన చెయ్యిపెట్టి.

కొడుకు మీదో, కోడలి మీదో కోపం రావటం తత్ఫలితంగా గోపాలందగ్గర రెండు రోజులో మూడు రోజులో ఉండటం వందో రెండో సమర్పించుకు తిరిగి రావటం ఆవిడకి పరిపాటే !

శంకరం క్యాలుహైసలకగానే "ఇక నే చెప్పేంత లేను నాయనా ! అమారాజు నాకేమిచ్చాడు !" అంది మీనాక్షమ్మ.

శంకరం చదువాగిపోయింది.

టైపు, షార్టుహాండు నేర్చుకున్నాడు. నెలకి తొంభైరూపాయలకి ఉద్యోగంలో ప్రవేశించాడు.

గోపాలం బి. ఏ. పూర్తయింది. చదువుకున్న విమలని చేసుకున్నాడు.

మర్నాడు పొద్దున్నేపోయి రైలెక్కించాడు శంకరం. "త్వరగా రామ్మా," అన్నాడు రైలు కదులుతుంటే. దారిలో అతననుకున్నాడు, "నా మాట నేను నిలుపుకున్నాగదా ?"

సరోజను చూస్తే కడుపు తరుక్కుపోతుంది శంకరానికి తన చేతులారా ఓ చీరకొని, "సరూ ! కట్టుకో" అని అన్న పాపాన పోలేదు. కాకపోతే దారిలో వస్తూ వస్తూ ఓ అణావో బేడనో ఎప్పుడన్నా మల్లె పూలు తెచ్చేవాడు. అంతే దానికే సంతోషించేది ! 'పిచ్చిపిల్ల !' అనుకున్నాడు.

"సరూ ! నా భార్యవటం నా అదృష్టం." అనుకునేవాడు. వెంటనే, "ఆమె ఏం సుఖపడుతున్నది ?" అని విచారించేవాడు. ఈమాట సరోజ ముందంటే, "చాల్లెండి ! చీరలుకొని, నగలుపెడితే నేను సుఖపడ్డట్టు." అని కోప్పడేది.

తల్లికి పదిహేనెకరాల్లోంచి వచ్చిన ధనమంతా గోపాలానికి అర్పిస్తుంది !

అన్నం వడ్డిస్తున్న సరోజ చేతికిఉన్న మట్టిగాజులు చూసి బాధగ నిట్టూర్చాడు శంకరం.

"ఎందుకట్లా బాధపడతారు ?" అంది సరోజ.

"ప్రతినెలా చీరకొందామనుకోటం కొనలేకపోవటమూను. ఈ నెల కొనాల్సిందే. కొని తీరుతాను. మీ వాళ్ళింటికి వెళ్లితే మీ నాన్న ధర్మమా అని ఇచ్చిన చీరలు కట్టుకుంటున్నావు ? ఛీ ! ఛీ. ఎందుకీ భర్త ఉండి." అంటచేత్తోనే ఆవేశంగా తలకొట్టుకొని లేచిపోయాడు. సరోజ నిర్ఘాంతపోయింది.

పదిహేను రూపాయలు పెట్టలేక చస్తుంటే తల్లి "పెద్దఇల్లో" అని గొడవ పెడుతుంది.

"ఏం? తీసుకోనివ్వగూడదూ?" అనుకున్నాడు శంకరం.

"ఇంకా తను మంచివాడు. లేకపోతే అంతడబ్బు ఉండి, తనకు ఇన్నేళ్ళనుంచి చిల్లికాని ఇవ్వక పోయినా అతను ఊరుకున్నాడు ఇంకా."

పనిగట్టుకుని అఫీసరు తనకే నానామాటలు అంటాడు.

నిశ్శబ్దంగావున్న నీటిలో చలనం కలగటం ఎంత సేపు?

ఒక్కొక్కరోజు శంకరం అనుకునేవాడు. "నేనెందుకు బ్రతుకుతున్నాను? నేను లేకపోతే సరు మరో కడ్ని చేసికుని సుఖపడేది." తన అవతారంవంక చూసుకున్నాడు, బాధగా ఏడుపొచ్చింది. విధిగా అతనివేళ్ళు టైపుమిషనుమీద నాట్యంచేస్తున్నయి!

విజయవాడ స్టేషన్లో రైలుఆగింది. ఇంజను మోత స్టేషనంతా వ్యాపిస్తున్నది. మీనాక్షమ్మ మూటలు తీసికుని దిగింది. గవర్నరుపేటవైపు వెళ్ళి పోయింది.

వీధివాకిలిముందు రిక్షాఆగిన శబ్దంవిని గోపాలం వాకిట్లోకొచ్చాడు.

"రా అమ్మా, రా. రా. ఎన్నాళ్ళకొచ్చావు?" అన్నాడు. తల్లి పరవశం చెందింది. క్షణంసేపు మాట రాక నిలబడిపోయింది.

"విమలా! విమలా!" భార్యని కేకేశాడు.

లోపల్నించి పదినిముషాలకి వచ్చింది విమల. స్వంతకోడల.

"మాఅమ్మ వచ్చిందే" అన్నాడు.

"రండి. రండి. ఎన్నాళ్ళకొచ్చారు" అంది విమల.

"నీళ్లుతోడు త్వరగా ఎప్పుడు బయలుదేరిందో" అన్నాడు కొడుకు. విమల లోపలికిపోయింది.

కొడుకు ననుసరించి తల్లికూడ లోపలికి వెళ్ళి పోయింది.

"ఈసారైనా ఆస్తి వ్రాయిస్తారా వ్రాయించరా?" అంది చాటుగ భర్తతో విమల.

"వ్రాయిస్తాను." అన్నాడు భార్యతో అతను "కాని, నువ్వు ఈనాలుగురోజులు నెత్తిన పెట్టుకోవాలి."

"ఏ నాలుగురోజులు?"

"బ్రతికున్న నాలుగురోజులు. ఎంతయినా కన్న కొడుకు."

"అలాకుదరదు. ఆస్తిఇచ్చేదాకా మాత్రం." అంది విమల. గోపాలం క్షణంసేపు ఆలోచించాడు.

"సరే. నీయిష్టం."

తల్లి వెళ్ళి నాలుగురోజులైనా రాకపోయేసరికి శంకరం బాధపడ్డాడు.

మీనాక్షమ్మగారికి ఓరోజు పక్షవాతం వచ్చింది ఉన్నట్టుండి.

ఆరోజు మధ్యాహ్నం గోపాలం తల్లిదగ్గర ఆస్తి విషయం ప్రస్తావించాడు,

"అమ్మా! నీకాపక్షవాతం వచ్చింది. డాక్టరు గారేమో [illegible] అంటు న్నారు. ఆస్తి శంకరానికి ఇస్తావో, ఇంకెవరి కిస్తావో చెపితే ఏదో ఏర్పాటుచేస్తాను." అన్నాడు దిగులుగా ముఖంపెట్టి.

మీనాక్షమ్మ అతనిమాటలు గ్రహించినట్లు చూసింది.

"అంతఆస్తి నీకిస్తారా. ఇది మీనాన్నగారి కష్టార్జితము — నాకు సర్వహక్కులతో వ్రాసిఇచ్చారు" అంది మీనాక్షమ్మ.

"మరి శంకరానికో?" అన్నాడు. పైకి

"ఆ. వాడు నామాటేం విన్నాడు? కమలని చేసుకున్నాడా? పైగా వాడిమీద నాకెందుకుం టుంది?" అంది.

ఇద్దరు పెద్దమనుష్యులఎదుట, తెల్లనిచేత నల్లని కాటుకపూసి వేలుముద్ర వేయించారు. ఆస్తిఅంతా గోపాలంపేర రిజిష్టరయిపోయింది.

ఆరోజు ఆవిడకి తిండితిప్పలు సరిగా వేళకివచ్చి నయి. కోడలు స్వయంగా చేత్తో అన్నంకలిపి నోట్లో పెట్టింది. కాళ్ళుపట్టింది. ఉపచారాలుచేసింది.

మీనాక్షమ్మ సంతోషించింది.

(362 వ పేజీ చూడుడు)




# సాహసవీరులు

శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు

(గతసంచిక తరువాయి)

అర్ధరాత్రిపూట కలకలంవిని రాజు బయట కొచ్చాడు. "ఏమిటిది! కలకలం? ఎవడువీడు?" అన్నాడు గర్జిస్తూ.

భటులు వినమ్రులై నమస్కరించి — "మహారాజా! ఈ బ్రాహ్మణదంపతులు తమ ఆజ్ఞను లెక్కించకుండా శివాలయానికివచ్చి పూజచేయుట మొంద పెట్టారు, అందుకని పట్టుకొని కట్టి ప్రభుసన్నిధికి తెచ్చాం?" అని మనవి చేశారు.

రాజు మహోగ్రంతో ఆ దంపతులవైపు చూశాడు. ఆ దంపతుల నొసటన విభూతిరేఖలు. ఆ చంకలో పిల్లవాడు—అసలే సంతానంలేకుండా మండిపోతున్న మహారాజుకు అల్లారుముద్దుల ఆ బాలుడిని చూడగానే ఇంకా మండిపోయింది. "నా ఆజ్ఞ ధిక్కరించి ఎందుకు వచ్చారు?" అన్నాడు గర్జిస్తూ.

"చిత్తగించాలి మహారాజా! లేక లేక కలిగిన బిడ్డ. హఠాత్తుగా జబ్బువచ్చింది. ఇహ నయంకాదని మేము ఆశవదులుకున్నాం. కాని రాత్రి మాకు పరమశివుడు కలలో కనిపించి తనను అర్చించి ఆతీర్థమును త్రాగించినట్లయిన బాలుడు ఆరోగ్యవంతుడగును అని శెలవిచ్చారు. కన్నబిడ్డలమీద తీపికొద్ది మీ ఆజ్ఞను ధిక్కరించి పూజచేయటానికి వచ్చాం మహారాజా! మన్నించి మమ్మల్ని వదిలివేయండి. మాకు పుత్రభిక్ష పెట్టినవారగుతారు." అని వేడుకున్నారు. కాని మహారాజు మనసు మారలేదు.

"దేవుడా! వాడెక్కడున్నాడు. ఉంటే ఇన్ని పూజలుచేశానే; ఇంతమందికి అన్నదానం చేశానే; నాకు కనిపించి నాకోర్కెను తీర్చలేదేం?"

"ఎన్నిపూజలుచేసినా చిత్తశుద్ధి ముఖ్యం మహారాజా"

ఇంతలో శీలవతి అందుకొని. "మహారాజా! మన్నించాలి, ఈ ఒక్కసారి పూజకు అనుగ్రహించండి. పూజ పూర్తిచేసుకొని నాబిడ్డని బ్రతికించుకుంటాం. మీ మేలు మరచిపోలేం!" అంది కన్నీరు మున్నీరుగా. "ప్రభూ! ఈఒక్కసారి కనికరించి వదిలేయండి, పూజపూర్తి చేసుకువచ్చిన తర్వాత మీరెన్ని దెబ్బలు కొట్టినా సిద్ధమే?" అన్నాడు:

"అయితే ఆదేవుడెక్కడున్నాడు?"

"మహాఋషులకుకూడా ఆయన నిజదర్శనం లభ్యం కావటం అరుదు. అటువంటిది సామాన్యుడిని నేను చెప్పగలనా? ఈరాత్రే శివాలయానికి వెళ్ళండి. ఆయనపట్ల మీరొనరించిన తప్పులను మన్నించమని వేడుకోండి. కరుణామయుడు నీలకంఠుడు మిమ్ము తప్పక క్షమించి తీరతాడు!" అన్నాడు.

"సరే! అయితే నేనిప్పుడే ఆలయానికి వెళతాను. అంతవరకూ వీళ్ళను కట్టడిలో వుంచండి. ఆపరమేశ్వరుడు నాకు ప్రత్యక్షమైందాకా వీళ్ళని కొట్టండి!" అన్నాడు.

ఇంతలో సుగుణ పరుగెత్తుకుంటూవచ్చి రాజుకు అడ్డుపడి! "నాథా! యీఅర్ధరాత్రి మీరక్కడికి వెళ్ళవద్దు. నామాటవినండి!" అంది ఏడుస్తూ. రాజు భార్య మాట వినలేదు. "ఆబ్రాహ్మణదంపతులను విడిపించండి. సాక్షాత్తు భూలోక దేవతలు! వారిని హింసించుట మనకు అరిష్టదాయకం!" అని వేడుకున్నా బండబారిన రాయిహృదయంచలించలేదు. మహారాణిని విదిలించుకొని ఆలయంవైపు పరుగు తీశాడు.

(2)

దేవేంద్రుడు పరాసరి శివాలయంలోపలకువచ్చి

ఒకమూలన దాక్కున్నాడు. కొంతసేపు గడిచింది. పార్వతీ పరమేశ్వరులు సంచారం ముగించుకొని గుడి లోపలకువచ్చి యథాస్థానం అలంకరించారు. కొంత సేపాగిన తర్వాత పార్వతి భర్తతో "నాథా! ఈ విడ్డూరంచూశావా!" అంది.

"ఏమిటది?" అడిగాడు పరమశివుడు.

"ఈ పట్టణం మహారాజు దేవాలయాలకు పూజా పునస్కారాలు లేకుండా పాడుపెట్టాడు. తాను పూజించక పోవటమేకాకుండా ఎవరైన పూజచేస్తే వారిని శిక్షిస్తున్నాడట కూడాను. ఎంత విపరీత బుద్ధి!" అంది. "వినాశకాలే విపరీతబుద్ధి" అని వూరికే అన్నారా! పార్వతీ, క్షేమేంద్రుడికి కలిగిన సంతానం క్షయమైపోతుంది. అందుకని ఒకమహర్షి సలహాపై పూజలూ అన్నదానాలూ ప్రారంభించాడు. భక్తివున్నా లేకున్నా ఆపద్మొక్కులు మొక్కాడు తన స్వార్థంకోసం. అవి శీఘ్రమే ఫలితమివ్వకపోయేసరికి అసలు దేవుడేలేడని వితండ వాదంలోపడి అజ్ఞానాంధకారుడై - నగరంలో ఎవరైనా దైవపూజ చేసినట్లయిన కఠినశిక్ష విధింపబడు తుంది. అని శాసించాడు. అందువలన ప్రజలు దడిసి మనకు పూజాపునస్కారాలు చేయటానికి వెనుకంజ వేస్తున్నారు." అని చెప్పాడు.

"అయ్యో! అజ్ఞానంలోపడి ఎంతపని చేస్తున్నాడు?" అంది.

"అతని అజ్ఞానం నశించేంతవరకూ ఇంతే" అన్నాడు శివుడు.

"పరమేశ్వరా! అతని అజ్ఞానం నశించిపోయి కండ్లుతెరిచేరోజు ఇక రానేరాదా?" అని అడిగింది.

"రాకేం! తన తప్పుతెలుసుకొని నిజం గ్రహించ గలిగిననాడే అతనికి మోక్షం—!"

"మహాదేవా! అతని సంతానం ఇలా క్షయమై పోవటానికి కారణంఏమిటి?" "కారణం కావాలా, అయితే వినుమహాదేవీ! క్షేమేంద్రుడు క్రిందటి జన్మలో విలాసనగరరాజు. అప్పుడు ఆయనకు వేట లంటే మహాయిష్టం. వారానికి నాలుగురోజులు వేట లోనే గడిపేవాడు. ఎప్పటివలె ఆరోజుకూడా వేటాడటానికి బైలుదేరాడు. అతని దురదృష్టమే ఆనాటి ఆరోజు ఒక్క జంతువుకూడా అగుపించ లేదు. మధ్యాహ్నంవరకూ తిరిగి తిరిగి అలిసిపోయాడు. విశ్రాంతి తీసుకుందుకు ఒకచెట్టు నీడన కూర్చున్నాడు. ఇంతలో ఒకలేడి అటుగావచ్చి రాజునుచూసి పరుగు లంకించుకుంది. మహారాజు చటుక్కునలేచి బాణం సంధించివదిలిశాడు. కాని బాణం గురితప్పింది. లేడి పారిపోయింది. ఇంతలో వున్నట్లుండి ఆక్రందనస్వరం వినిపించింది. మహారాజు కంగారుగా అటువైపు పరుగుతీశాడు. తత్సమీప వృక్షపుఛాయన నలుబదిఏండ్ల స్త్రీ ఒడిలో బాలుని పెట్టుకొని ఏడుస్తూకూర్చుంది. మహారాజు చరచరా ఆమెదగ్గరకు వచ్చాడు. "అయ్యో! ఎంతపని జరిగింది. నేను లేడిమీదికి వదిలిన బాణం దారితప్పి బాలునికి తగిలిందా అమ్మా! క్షమించు తల్లీ! తెలియక చేసిన అపరాధం" అన్నాడు.

ఆమె బిగ్గరగారోదిస్తూ — "నాభర్త మరణావస్థలోవుండగా ఈబిడ్డ కడుపునబడ్డాడు. ఆయన పోయిన తర్వాత వీడుపుట్టాడు. భర్తపోయిన దిగులును కొంత మరిపింపచేశాడు. నాచిట్టితండ్రి, కాని వీడికి యీమధ్య పెద్దజబ్బుచేసింది. కొందరు శ్రీశైలంవెళ్ళి మల్లికార్జునుని దర్శించితే నీబిడ్డ అరిష్టం తొలగునని చెప్పారు, వారి మాటల ప్రకారం భగవద్దర్శనంకోసం బయలుదేరాను. మధ్య నీవు యముడివై నాబిడ్డను పొట్టనపెట్టుకున్నావు. పాపాత్ముడా! కన్నూ మిన్నూ కానక అహంతో ఇంతపనిచేశావు. ఈ దుష్కృత్యం నీకు తగిలి తీరుతుంది!" అంది గుండెలవిసేలా రోదిస్తూ. పార్వతీ! ఆ అబలశాపమే ఈజన్మలో మహారాజుకు తగిలి పుట్టిన సంతతినెల్లా మ్రింగుతూవచ్చింది. అవివేకం తెలుసుకోక దైవాన్నినిందిస్తూ పూజాదులు మానిపించివేశాడు!" అని చెప్పాడు.

"మరి దీనికి ప్రాయశ్చిత్తమే లేదాస్వామి!"

"నీవే యోచించుదేవి!"

ఇదంతా చాటునుండి వింటున్న క్షేమేంద్రుడు చలించిపోయాడు: కండ్లవెంట జలజలా అశ్రువులు రాలినయి పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు. వెంటనే క్షేమేంద్రుడు గబగబా బైటకువచ్చి పార్వతీ పరమేశ్వరుల పాదాలవాలేసుకుని — "స్వామీ! నా అపరాధం మన్నించండి. అజ్ఞానావిష్టుడనై కన్నూ మిన్నూ గానక అహంకారంతో ప్రవర్తించాను — నా అహం తెలుసుకున్నాను. నేటికి నాకళ్ళుతెరచుకొన్నాను, మిమ్ములను ధిక్కరించి మీ ఎడలతీరని అపచారంచేశాను — నన్ను క్షమించండి." అని గగ్గోలుపెట్టి ఏడ్వసాగాడు.

(సశేషము)

# ఆదర్శ బాలురు

శ్రీ ముంగర కోటేశ్వరరావు

పసిడి పలుకులు పలికెడి పాపలార!
భావి పౌరులవలెనను బాలలార!
ఆలకించుడీ! మీ రలు యాసతోడ
మీకు బుద్ధులు నేర్పెడు మంచికథను

అనగనగ నొక యూరు నీయవని లోన
వానియందున గలడొక హీనదశక్కు
దిక్కు లేనట్టి వాడును దీనుడతడు
ఎనుబదేండ్లను దాటిన వృద్ధుడతడు

బిచ్చమెత్తును నాతడు నుత్సవమున
కరుణకలిగిన పడతులు కరమునత్రి
పెట్టుచుందురు పాత్రలో ప్రేమతోడ
ముసలిభుజియించు దానిని ముదము
మీఱ

ఇటులనెన్నియొ దినములు నేగిపోయె
వచ్చె తిరునాళ్ల యొక్క రోజు హెచ్చు
గాను

చాల బాగుగనుండెను సరసులకును
బయలు దేఱెను ముదుసలి భక్తితోడ

వత్సరము వత్సరంబును ప్రజలుకోర
జరుపుచుందురు తిరునాళ్ల చక్కగాను
దేవదేవుని గొలిచెడిధీరమతులు
గలుగుచుందురు వారికి ఘనముగాను

పగలుగడచెను పిదప ప్రొద్దుయును
బోయె

వర్షధారలు పడుచుండె పందిరిలగ
ముసలితాతయు యూరికి మొసలలేక
కూరుచుండెను నొకచోట కూర్మివదలి

వణకుచుండెను చలిబాధవదలకుండ
శక్తిగలవారు చూచియు చూడనట్లు
పోవుచుండిరి కొందరు పోజుబెట్టి
గేలిచేయుచునుండిరి కోర్కె దీఱ

బాలకులు వచ్చిరింపుగ పలువురటకు
ఇరువురుండిరి వారిలో విప్రులుగను
భాగ్యవంతులరయి గూడ బాలుపడకు
ఎన్ని బాధలు పడినను ఎటులనైన

సేవచేసిరి వానికి చేతులలర
చేష్టలన్నిటి దేవతల్ చేరిచూడ
బాలురందలి గుణములు బాగు అనిరి
పిన్నలందలి బుద్ధులు పిల్లవగునె

ఎట్టి సమయములోనైన నిజముపలుకు
చేతనైనంత పరులకు సాయపడుము
బాలలీరీతి బుద్ధిగా బరగినపుడె
దేశమంతయు సుఖముల దేలియాడు

—o—

# కుక్క కాటుకు చెప్పు దెబ్బ

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని.

ఇద్దరు వైశ్యసోదరులు భాగాల పంపిణీదగ్గర తగాదాలు పడి పడి ఎలాగో మిగతావస్తు సామాగ్రి, ఇళ్ళు, పొలాలు పంచుకున్నారు. కాని ఒక ఆవు దగ్గర తగాదావచ్చింది. అది ఎవరికి రావాలా అని? "పెద్దవాణ్ణికదా! నాకు ఇమ్మంటాడు" పెద్దవాడు. చిన్నవాణ్ని. నాన్నకు అమ్మకు నామీద ప్రేమ. నాకేరావాలంటాడు చిన్నవాడు. ఇలా కాదంటే కాదు అని ఒకమధ్య వర్తిదగ్గరకు వచ్చారిద్దరు.

మధ్యవర్తి "పోనీలే, ఇంటికి పెద్దవాడుగా ఆవుని ఇచ్చెయ్" అన్నాడు చిన్నవానితో.

"నేనివ్వనంటే ఇవ్వను" అన్నాడు పెంకిగా చిన్నవాడు.

"చిన్నవాడికి ఇవ్వరాదుటోయ్ ఆవుని" అన్నాడు పెద్దవాడితో.

"న్యాయం చెప్పండిబాబూ" అని ప్రాధేయపడ్డాడు పెదవాడు.

"అయితే వినండి. ముఖంనుండి నడుంవరకుఅంటే ముందటి సగము పెద్దవానికి, వెనకాల పొదుగుఅది అంటే రెండవ భాగము చిన్నవానికి వచ్చేటట్లు తీర్పుచెప్తున్నాను" అన్నాడు మధ్యవర్తి.

"అదేన్యాయం" అంటూ అక్కణ్ణించి చిన్నవాడు వెళ్ళిపోయాడు.

పెద్దవాడు మధ్యవర్తితో "అదేమిటి స్వామీ. అలాచెప్పారు. అంటే నేనావును మేపటము వాడు పాలుపితుక్కోవటమూనా. ఎంత అన్యాయమండి" అన్నాడు.

"కంగారుపడకు నాయనా వాడికి తగినశాస్తి నేను చెప్తానుగా నీకు వాడు దారికిరావాలంటే నీవు ఈరోజునుంచే ఆవుకు గడ్డివేయరాదు. పైగా వాడు పాలుపితికే సమయానికి వచ్చేటట్లు ఆవును బాదు, వాడు తప్పక రాజీకివస్తాడు" అన్నాడు మధ్యవర్తి.

ఇంకేం ఆరోజునుంచే ఆవు చిక్కుతున్నది. చిన్నవాడు పాలుపితుకుతుంటే మన పెద్దబ్బాయి ఆవుని ముఖంమీద చావకొడుతున్నాడు. అసలే నకనకలాడుతున్నదేమో ఒక తాపుతన్నింది ఆరోజు చిన్నబ్బాయిని.

"ఎందుకు దాన్ని చావబాదుతున్నావు. తిండి గూడలేక చంపుతున్నావు" అన్నాడు చిన్నవాడు.

"నాయిష్టం నాసగం నేనేమన్నా చేసుకుంటాను. నీకెందుకు" అన్నాడు. అప్పుణ్ణించి చిన్నవాడు బుద్ధితెచ్చుకుని, అన్నతో కలిసి ఆవుని మేపుకుని చెరిసగంపాలు తీసుకోనటానికి రాజీకివచ్చాడు.

చూశారా! బాలలూ! టక్కాటుకు చెప్పుదెబ్బ.

---

# జీవిత నిర్ణయం

శ్రీ ఎస్. ఎన్. వాద్రేవ్

బయట హోరున వర్షం కురుస్తోంది. ఉరుములు ఫెళ ఫెళమంటున్నాయి. బయటకు వెళ్ళడానికి వీలులేదు. తలుపులు దగ్గరగా వేసివచ్చి యీజీ ఛెయిర్లో కూలబడ్డాను. తలపోటు ఎక్కువగావుంది. దానికి తగ్గట్టు ఆలోచనలుకూడా అలాగే వున్నాయి. వీటన్నిటిని చీల్చివేస్తూ, తలుపులు ధభాలున తోసుకుని ఎవరో లోపలికి వచ్చారు. ఎదురుగానున్న శారదనుచూసి ఆశ్చర్యపోయాను. బట్టలు కొద్దిగా తడిసాయి. మొహంజీరుకు పోయినట్లుంది. చెక్కిళ్ళమీద కన్నీటిచారలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. మెల్లిగా ఈలోకంలోకి వచ్చి; "లోపలికిరా! శారదా, వర్షంలో తడిసిపోయావు" అన్నాను.

తడిసిపోయిన చీరకుచ్చెళ్లు పిండుకుని మెల్లగా లోపలికివచ్చింది.

"అలా కుర్చీలోకూర్చో! వర్షంలో తడిసి మరీ వచ్చావ్, ఏంపనిమీద?" అని ప్రశ్నించాను.

నేనువేసిన ప్రశ్నకు సమాధానంగా అంతవరకు దించుకొన్న మొహాన్నిపైకెత్తి; "నువ్వు నన్ను నిజంగా వివాహమాడదల్చుకున్నావా?" అని భోరున ఏడ్చింది శారద.

నాకు అర్థం అవలేదు ఈప్రశ్న శారద నోటమ్మట ఎందుకు వచ్చిందో. "ఏమిటి శారదా! అలా అడుగుతావు. నేను యిదివరలో నీకెన్నిమార్లు చెప్పాను. నిన్ను తప్ప యింకెవ్వరిని పెళ్ళిచేసుకోనని" అన్నాను.

"నాకు యిన్నాళ్ళనుంచివున్న అనుమానం యీరోజున తీరింది."

"నేననుకుంటూన్నదీ ఆదే" నవ్వుతో అన్నాను.

"నిజంగా మనిద్దరికీ వివాహం అవుతుందా?"

"ఆ అనుమానం నీకక్కరలేదు"

"కాదు! శేఖర్!! నా అమాయకత్వాన్నిచూసి అలా అన్నావేమో"

"ఇంత అనుమానంతో ఈ హోరున కురిసేవర్షంలో ఎందుకు వచ్చావో నాకు తెలియుడములేదు" కొంచెం చిరాకుతో అన్నాను.

"నీకు గనక అర్థమయితే నన్ను క్షమిస్తావుకదూ!" ప్రాధేయ పూర్వకంగా అడిగింది శారద.

"నువ్వేమి చేశావని నిన్ను క్షమించడానికి"

"ఆ! క్షమిస్తాను"

"ఎంత పెద్దనేరమయినా"

"ఆ!" "అయితేవిను" అని శారద ప్రారంభించింది.

"నువ్వు నన్ను ఎలా ప్రేమిస్తున్నావో నిస్నేహితుడు రాజుకూడా నన్ను ప్రేమిస్తున్నాడు. నేను యిద్దరిలో ఎవరికి మోసం చెయ్యడంలేదు. ఇలావుండగా ఒకరోజున రాజు కాలేజీకి మధ్యదారిలోనే రనబడి పికారుకి వెడదామన్నాడు. నాకు యింటి దగ్గర పనులున్నాయని చెప్పాను. రానన్నా కాని బలవంతంమీద ఒప్పించి తీసుకు వెళ్ళాడు. అప్పటికి చీకటి పడుతోంది. గాంధీనగరం పార్కు చేరుకుని ఒక బెంచీ మీద కూర్చున్నాం. జనంరద్దీ తగ్గిపోతోంది. చల్లటిగాలి వీస్తోంది, కొద్దిసేపు కాలేజీకబుర్లు అయ్యాక ప్రణయకబుర్లు లోకి దింపాడు. నాకు చాల అసహ్యం వేసింది. "శారదా" అన్నపిలుపుతో ఉలిక్కిపడి అతనికేసి చూశాను. ఆరోజు రాజు మొహం అదోలావుంది.

"చూశావా! శారదా! ఆ పిండార బోసినట్లు వెన్నెల; మలయమారుతంలా వీస్తున్న ఆచల్లనిగాలి వృధాఅయిపోతున్నాయి." అన్నాడు రాజు.

"అయితే" అన్నాను. "మనం యిలా కూర్చోవడం తగదు." అని వెకిలిగా నవ్వి నాచేయి పట్టుకున్నాడు. తర్వాత నన్ను అంధకారంలోకి లాగుకొనిపోయాడు. తర్వాత నన్ను మాయింటిదగ్గర దిగబెట్టాడు.

యింతవరకూ చెప్పి పెద్దపెట్టుగా ఏడవ్వం ప్రారంభించింది. కొద్దిసేపటికి తమాయించుకుని మళ్లా యిలా చెప్పింది.

"యింకా అయిపోలేదు శేఖర్! వాడు అంతలో ఒదిలిపెట్టలేదు. కొన్నాళ్ళకి గర్భవతి నయ్యాను. రాజుదగ్గరికివెళ్ళి చెప్పాను. నాకేమీ తెలియదన్నట్లు మాట్లాడాడు. వివాహం చేసుకోనమంటే చేసుకోనన్నాడు." అని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"శేఖర్! నేనుచేసినతప్పు దానికి శిక్షూ పకు లెవ్వరో చెప్పవూ" అని నాకాళ్ళ మీద పడింది.

"శారదా! అలా ఏడవకు; ప్రపంచంలో ఎంతమంది తప్పులు చెయ్యడం లేదు. ఆతప్పుల్నే పట్టుకుని ప్రేలాడుతున్నారా?" అని ఊరడించాను.

అంతటితో ఊరుకోక మళ్లీ ఏడుస్తూ; "శేఖర్! ఈబిడ్డనేం చెయ్యాలో నాకు తెలియటంలేదు" శారద అంది.

"శారదా! నువ్వేం భయపడవద్దు. నాకు పిల్లలంటే యిష్టం. నేను నిన్ను వివాహం చేసుకుంటాను" అన్నాను.

"నిజంగా! శేఖర్" ఆమెకళ్లు దివ్య జ్యోతుల్లా వెలిగాయి.

"అవును! శారదా!". శారదమళ్ళీ ఏడ్చింది.

"ఎందుకు శారదా! మళ్లీ కళ్లమ్మట నీళ్లెట్టుకుంటావు"

"కాదు! నువ్వు నాకళ్లు నాచేత తెరిపించావు" కళ్ళు తుడుచుకుంటూ అంది శారద. "అంటే" అన్నాను.

"యింతవరకూ యిద్దరిని ప్రేమిస్తున్నాను. ఆయిద్దరిలో నేను ఎవరినిపొందాలో తెలియక చాల యిడయ్యాను-కాని-

"అయితే" ఆమె నవ్వింది. ఇంత

వరకూ ఏడ్చింది. క్షణంలో మార్పెలా వచ్చిందా అని ఆశ్చర్యపోయాను.

"నువ్వు ఆశ్చర్యపడుతున్నావు కదూ శేఖర్! నీకు నేనింతవరకు చెప్పిన సంఘటనను యిదివరకు రాజుకి చెప్పాను నీ పేరుతో. ఆకఠినహృదయుడు నన్ను తూలనాడాడు. ధనం కంటబడేసరికి కళ్లుమూసుకుపోతాయి కాబోలు" అంది శారద నవ్వుతూ.

"ఆ! యిదంతా, నిజంకాదన్నమాట"! తెల్లబోయి ఈజీఛెయిర్లో వెనక్కి వార్లబడిపోయాను.

"కాదు! మొన్న కాలేజీ ఫంక్షన్స్‌లో నన్నో నాటకంలో వేషం వెయ్యమన్నారు. ఆవేషం యీమాదిరిదే. నిన్ను వివాహం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో యిలా చేశాను. నన్ను క్షమిస్తావుకదూ" అంది శారద.

"దీనికోసమని యింతకష్టపడ్డావెందుకు?"

"యింతకష్టపడితేనే కాని నాజీవితేశ్వరుణ్ణి ఎన్నుకోలేకపోయాను."

"చాల మంచిపనిచేశావు. శారదా! అయితే మళ్లీ నెలలోనే మనిద్దరి పెళ్లి" నవ్వుతూ అన్నాను.

"నేను వెళ్లవస్తాను"

"యింకా వర్షం తగ్గలేదు-తగ్గాక వెళుదువుగాని"

"సరే" అంది నవ్వుతూ శారద.

తర్వాత ఒకగంటసేపు సరదాగా మాట్లాడుతూ గడిపాము.





# 'పాపం బ్రద్దలైంది'

'రాఘవ'

(గతసంచిక తరువాయి)

పండుగలూ - పబ్బాలూ వస్తే - పిండివంటలు చేస్తూండేవాళ్లు. ఎవ్వరికీ యేకష్టమూ కల్గించకుండా, ఓరుపుగా, దుక్కిటెద్దులాగా పనులు కల్పించుకొని చేస్తూండేవాళ్లు. పసివాడైన రామకృష్ణుణ్ణి, ఒళ్లో పెట్టుకొని, జగన్నాథం, సాకుతూండేవాడు తీరిక సమయాల్లో. వాడి ఆటపాటల్లో పాల్గొంటూ దుర్గమ్మకూడా ఎంతో సంతోషంగా కాలం వెళ్ళబుచ్చుతూవుంది. జగన్నాథంమాత్రం అడపా తడపా, శారద పేరునవున్న మిగతా రెండెకరాల్నీ, చూసి వస్తూ, కావలసినపనులు చేయిస్తూ - అజమాయిషీగా వుండి చూస్తూండేవాడు. యిది వీరభద్రంకి కంటకంగావుంది. చేతిలోవున్న అయిదువందలూ నిష్కారణంగా అప్పగా యిచ్చి, శారదపని గడిచిపోయేలాగుచేసేనే! అని దిగులుపడసాగాడు. అయిదువందలూ పోవటమేగాకుండా, అందుతుందనుకొన్న శారదకూడా పిట్టలాగా, చేతుల్లోంచి, ఎగిరిపోయిందని, కుమిలిపోవటం మొదలెట్టాడు. దీనికితోడు, ఆమె పొలంమీద, జగన్నాథం అజమాయిషీ. పుండుమీద కారంచల్లినట్లయింది. గుండెలమీద కుంపటి పెట్టినట్లయింది.

అతనిలో రేగినద్వేషం — పగ — వర్ణనాతీతం. ఎలాగైనా, శారద జీవితాన్ని కళంకపర్చాలని వూహించాడు. యిప్పుడున్న, నీడకూడా చేయాలని సంకల్పించాడు.

శారద జీవితాన్ని బూడిదపాలుచేస్తేనే గాని, తన హృదయం శాంతించదనుకున్నాడు. ఆమెకూ-తనకూవున్న శరీరసంబంధాన్ని ఎట్లాగైనాసరే, జగన్నాథం యింట్లో పొక్కేలాగు చేయాలనుకొన్నాడు. నిలువనీడ లేకుండాచేస్తేనే గానీ, తన కాళ్ళమీదపడి, ఆశ్రయం కోరదనుకున్నాడు. కల్మష పూరిత హృదయంతో, తీర్మానించుకొన్నాడు. తీవ్రంగా ఆలోచించటం మొదలుపెట్టాడు. యీ సంగతి పాపం! శారదకేం తెలుసు. గుట్టుచప్పుడుగా జగన్నాథం యింట్లో బ్రతుకుతోంది. పనిచేసినంత సేపూ, శ్రద్ధాభక్తులతో చేస్తోంది. కలో, గంజో త్రాగి ప్రాణం నిలబెట్టుకొంటోంది. చంటివాణ్ని కనురెప్పలమాటున దాచుకొంటూ, కాలం వెళ్ళబోస్తోంది. తను చేసిన, చీకటిపాపం ఎక్కడ తెలిసిపోతుందోనని ఒదిగి, ఒదిగి జీవించసాగింది. వీరభద్రం పీడ వదిలిపోయిందని, కొంతవరకు నిబ్బరంగా వుంది.

మూడు నెలలు గడిచినయి. శారద విషయంలో, దుర్గమ్మ - ధర్మారావూ లాలూచీపడి, ఆనాడు ఆలోచించుకొన్న విషయాన్ని, మాటా - మాటా సందర్భంలో వ్యక్తంచేసారు. శారద విన్నమీదట, ఆడుకొంటున్న కుమారునివంక చూస్తూ - "నేను మీ మాట నెప్పుడూ కాదనలేను. నాకు దక్కిన ఆ రెండెకరాల్నీ, ఎవరు సాగుబడిచేసి పండించినాసరే, నేనేమీ అనుకోను. కాని, నాకుమారుణ్ణి మాత్రం దిక్కులేనివాణ్నిగా చేయవద్దని కోరుకుంటున్నాను. వాణ్ని ఏదోవిధంగా పెంచి, పెద్దచేసి, చదువూ - సంధ్యా చెప్పించి, ఒకమనిషిగా తయారుచేస్తే, నాకదేచాలు. నాకు యింకేకోరికాలేదు. అక్కడికివెళ్ళి నేనేమీ వ్యవసాయం చేయించలేను. బావగారి పుణ్యమా అని, వచ్చే, ఆ అయిదెకరాల్తో, మీవద్దేవుండిపోతాను. మీరుపెట్టే, యీ నాలుగు మెతుకుల్నీ తింటూ బ్రతుకుతాను. తరువాత మీ యిష్టం" - అంది. తల్లీ కొడుకులనుకున్నది, వేసిన ఎత్తుగడ సాగిందని సంతోషించి, వెంటనే, ధర్మారావు, శారదతో—

"పిన్నీ... అయితే నేను నీపొలం సాగుబడి చేస్తాను" అన్నాడు.

శారద సంతోషపడింది. జగన్నాథం బదులు, ధర్మారావు. అజమాయిషీకి వెళ్ళడం సాగించాడు వ్రాయవలసిన ఒప్పందపత్రాలుకూడా, జగన్నాథం చేత, దుర్గమ్మ వ్రాయించేసింది. శారద మంచికే యిదంతా జరుగుతోందని జగన్నాథం వూహించాడు. జయలక్ష్మి కిదంతా వింతగాతోచింది. తన భర్త - అత్తగారు ఎలాంటివారైందీ, యింకా

శారద తెలుసుకోలేదని, విచారపడింది. ఈసంగతి ముఖ కవళికలనుబట్టి శారద గ్రహించింది.

ఒకనాడు, తీరికచూచుకొని, ఎవ్వరూలేని సమయంలో, జయలక్ష్మిని, 'వొదినా!' అనిపిల్చి, "ఏమిటలా వుంటున్నావని" అడిగింది. మొదట్లో జయలక్ష్మి ఏమీలేదనన్నది. శారదవూరుకోలేదు' బలవంతం చేసింది. జయలక్ష్మికి చెప్పకతప్పలేదు. శారద వినటానికే, కుతూహలపడింది. వొళ్లో కి చేరారు. దొడ్డితలుపులు గడియవేస్తారు. చుట్టింట్లో కూర్చొని, జయలక్ష్మి, శారదకు, తాను తెలుసుకొన్న, తల్లి కొడుకులవూహల్ని, ఎత్తుగడల్ని, సంపూర్ణంగా చెప్పేసింది. ప్రొద్దుతిరిగింది. మళ్లీ పని వేళవుతోందని యిరువురూ లేచారు. అలా రెండు మూడు రోజులపాటు, దుర్గమ్మ - ధర్మారావుల మనస్తత్వాన్ని యిరువురూ శాకమ్మకథగా చెప్పుకున్నారు. శారదకు భయంవేసింది. తన భర్తవల్ల, తనకు ఎటువంటి ఆపదరానుందో పూర్తిగా తెలిసిపోయింది. తనపట్ల చూపుతున్న యీప్రేమాభిమానాలన్నీ, కేవలం, ఆ రెండెకరాలకోసమేనని తెల్సుకుంది. తన అనంతరం, రామకృష్ణుడికి చిన్నాన్నగ్రా చేరికస్తారేమోనని అభిప్రాయపడింది. ఏం చేయాలో తోచలేదు. ఎక్కడికిపోయి హాయిగా బ్రతకటమో! శారద తరంకాలేదు. యిలాంటి విషమ సమస్యలోనే, వీరభద్రం ఒకసారివచ్చి, శారదనిచూసి వెళ్ళిపోతూండగా జగన్నాధం చూస్తాడు. "ఎందుకొచ్చావని" అడుగకముందే, "పొలం కౌలూకూ ఓ అయిదువందలిచ్చాను. యిప్పుడేమైనా వస్తుందేమో అడిగి వెళదామని" వచ్చానన్నాడు. జగన్నాధం తెల్లబోతూ, శారద వంక చూస్తాడు. శారద, ధారమైన హృదయంతో- "అవునండీ బావగారూ! ఓ అయిదువందలు యివ్వవలసిన మాట వాస్తవమే!" — అంది. జగన్నాధం తాళుకోలేక, "పంటలొచ్చిన తరువాత సర్దుతాలే"- అని జవాబిచ్చి పంపేశాడు. వీరభద్రం కోర చూపుల్తో, శారదనుచూస్తూ, వీధిగుమ్మందాటాడు, శారద మనస్సు కుదుటపడింది. ఏ అఘాయిత్యంచేసీ, తన జీవితాన్ని ధ్వంశంచేస్తాడోనని కంగారుపడింది సమయానికి, జగన్నాధం వచ్చినందుకు గుండె దడ తగ్గింది. ఆరోజున, వీరభద్రంగురించి, యింటిల్లిపాదీ, ఒక్క జగన్నాధంతప్ప, అంతా అడిగినవారే! రకరకాలుగా అడిగారు. శారద అన్నిప్రశ్నలకు సమాధానాలిచ్చింది. కాని, అంతరాత్మలో అతనంటే, ఉచ్చేభయం వేయటం మొదలెట్టింది. కనిపెట్టినా వదులుతుందిగాని, వీరభద్రంవడితే వదలడని, ఆనాటికి తెలుసుకొని రూఢిచేసుకొంది.

## 10

ఒక్క సంవత్సరం, శారదకు అతికష్టంమీద గడిచింది. వీరభద్రం యీసంవత్సరకాలంలో రెండు మూడు దఫాలు చాటుచాటుగావచ్చి, శారదను చూసి, సరి సరి విధాలుగా మాట్లాడటం సాగించాడు. శారద భయభ్రాంతురాలవుతూండేది. ఎన్నో విధాలుగా, శారదను, తనదగ్గరకొచ్చి వుండమని ప్రాధేయపూర్వకంగా అడిగాడు. ఏకష్టమూ కల్గింత నన్నాడు. మనసూర్తిగా నిన్ను కనిపెట్టుకుని వుంటానన్నాడు. శారదవినలేదు. తిరస్కరించింది. "ఇక ఎప్పుడూ యీగుమ్మం తొక్కవద్దని" చెప్పింది. అతను క్రోధంతో చూశాడు. ఆమె గజగజలాడింది. "సరే! నీజీవితం ఏమవుతుందో చూడు" అని, అఘరిపారిగా వెళ్ళిపోయాడు. శారద, ఆ రాత్రంతా, తిండీ, తిప్పలు మానుకొని, కంటికి మింటికీ ఏకధారగా ఏడ్చింది. జయలక్ష్మి, శారద నితిని పసిగట్టింది. మెల్లిగా అడిగింది అసలు విషయం చెప్పమని. శారదకు మనస్కరించలేదు. జయలక్ష్మి బ్రతిమాలింది. చివరకు చెప్పకతప్పలేదు. 'తనకూ వీరభద్రంకివున్న సంబంధమూ - చేసిన చీకటిపని - పండిన చీకటి పాపం - యిప్పుడనుభవిస్తున్న ఆపాపపు ఫలితం వివరంగా చెప్పింది. ఆనాడు ఎందుకోయిలా చెప్పుకోవడానికి, యిరువురకూ వీలు పడింది, సవిస్తరంగా శారద చెప్పేసింది. జయలక్ష్మి కళ్ళల్లో నీళ్లునిలిచినయి. 'యీ ఆడజన్మ ఎందుకు ఎత్తినట్లో, ఆమెకు తెలియలేదు, మునుపటికన్నా కూడా శారద చిక్కిపోయింది. వీరభద్రం ఎట్లాగో, తన జీవితాన్ని నాశనంచేసి తీరుతాడని నమ్మేసింది. తనకెక్కడా నిలవటానికి, స్థానంలేకుండా చేస్తాడని వూహించివేసింది. మనస్సు అనేకవిధాలుగా చెదిరిపోయింది. రోజులు క్రమక్రమంగా గడుస్తున్నకొద్దీ, శారదచిక్కి శల్యమైపోసాగింది. ఆమెలోవున్న అల జడి, ఒక్క జయలక్ష్మికితప్ప మరెవ్వరికీ తెలియదు. తనని అభిమానంతో చూస్తూవున్నదికూడా జయలక్ష్మి. అందువల్ల, ఆమెకు తెలిసినా, ఫర్వాలేదనుకొంది.

రామకృష్ణ, ఆనాటి నుండు ఒళ్లుచేస్తూ, యిల్లంతా కలియతిరుగుతూ, అల్లరిచేయటం సాగిం

వాడు. అందరికీ అలవాటైనాడు. ముఖ్యంగా జయలక్ష్మికి ఎక్కువగా అలవాటయ్యాడు. శారదకంటే, ఎక్కువగా, అతణ్ణి సాకటం సాగించింది. నిద్ర లేచిన దగ్గరనుంచీ, పడుకోబోయేవరకూ జయలక్ష్మి సేవలే, రామకృష్ణ పెంపకానికి ఆధారభూతాలు. తల్లిని చూడకుండా కూడా వుండగలడేమోగానీ, జయలక్ష్మిని మాత్రం క్షణంవదిలి వుండలేకపోతు న్నాడు. అలా పెరుగుతున్నాడు. చంటివాళ్లకేం తెలుసు? ఎవరు చనువిస్తే, వాళ్లదంకే ఎక్కుతారు. అలాగే రామకృష్ణవిషయంలో, శారదకన్నా, జయలక్ష్మికే బాధ్యతలేర్పడినయి. యిలా వుంటూ వుండగా, ఒకసారి జగన్నాధం - దుర్గమ్మ - ధర్మారావు అంతాకలిసీ, ఎవరిదో బంధువుల వివాహానికి వెళ్ళారు. జయలక్ష్మికి ఆరోగ్యం బాగుండక, మానుకొంది. అందువల్ల, శారద, జయలక్ష్మి యింట్లో వుండిపోయారు. పగలల్లా శారద యింటిపనులుచేసి, మత్తుగా పడుకొంది. జయలక్ష్మి పక్కలో రామకృష్ణ నిద్రపోతున్నాడు. జయలక్ష్మి కలతగా పడుకొంది.

సరిసగంరాత్రి గడిచింది, మూసుకొనివున్న తలుపులు కొట్టినట్లు చప్పుడైనయి. జయలక్ష్మికి వినిపించింది. కళ్లుతెరచి - లేవలేక.

"ఎవరూ?" — అంది. తలుపుచప్పుడు ఆగిపోయింది. జయలక్ష్మి, "చిన్నత్తయ్యా!" — అని పిల్చి, లేపింది. శారద, బడలిక నిద్రవల్ల త్వరగా లేవలేదు. తిరిగీ, మళ్ళీపిల్చింది. వులిక్కిపడి, శారద నిద్రలేచింది. చుట్టూ చూసింది. చిన్నదీపం వెలుగుతోంది. యిల్లంతా చడీచప్పుడూ లేకుండావుంది. నిశ్శబ్దం మూర్తీభవించింది. కళ్ళునులుముకొని, తేరిపారచూసింది.

"చీకటి పాపం - అసాటిగ -" మనస్సులో మెదిలింది. భయంవేసింది.

"చిన్నత్తయ్యా!" - జయలక్ష్మి మళ్ళీపిల్చింది.
"ఆఁ..." - శారద పల్కింది.

"తలుపు చప్పుడవుతోంది ఎవరోవచ్చారు. కాస్త తలుపుతీద్దూ!" - అంది.

"వీరభద్రం కాదుగదా!" — శారద వులిక్కిపడింది. అప్రయత్నంగా, అతనిపేరు పీడకలలాగా గుర్తొచ్చింది.

"యీపాటప్పుడు ఎందుకొస్తాడులే" — అనుకొంటూ మెమ్మదిగా లేచివెళ్ళి, తలుపుగడియ తీసి, చీకట్లోకి, తొంగిచూసింది - ఎవ్వరూ కనిపించలేదు.

జయలక్ష్మి భ్రమపడిందేమోనని, అనుకొని, మళ్లా తలుపుల్ని మూయబోయింది.

"శారదా!"—అచీకట్లో, ప్రహరీ గోడమూలగా, ఎవరిదో కంఠం వినిపించింది, మనిషి కనిపించటం లేదు. ఎవరోనని మెట్లుదిగింది తలుపులు ఓరగావేసి, చూడటానికి.

నాలుగువేపులూ కలయచూసింది... యీశాన్య మూలగా, ఎవరోకదిలి, తనదగ్గరగా వస్తున్నట్లు, అలికిడి అయింది. శారద అటువైపే భయభయంతో చూస్తూ నిలబడింది. కదిలిన స్వరూపం, మెల్లగా, గడ్డివాము చాటుకొచ్చి,

"శారదా! ఒక్కసారి యిలారావూ! నేను."

శారద, ఆకంఠంని గుర్తుపట్టేసింది. కదలటానికి, కాళ్లు భూమిలోకి చొచ్చుకొనిపోయినట్లు, బయటికి లాగటానికి శక్తిలేకుండా పోయింది. ఏదో బాధ, ఆమెహృదయంచుట్టూ అల్లుకుంటోంది... మాగ మూర్తి దగ్గరకొస్తూ—

"నేను... శారదా! అలా ఎందుకూ భయపడతావ్?"

"మువ్వా... వీరభద్రం..."
"ఏం... గుర్తుపట్టలేదా?"

"మళ్ళా ఎందుకొచ్చావ్... సిగ్గులేదూ. రావద్దంటే!"

"నీకోసం, రావటానికి సిగ్గెందుకూ?"
"ఛీ" - చీదరించుకొంది శారద.

"చీదరించుకోకు శారదా! ఆదరించటానికొచ్చాను. రా. వెళ్ళిపోయి, ఎక్కడైవాసరే హాయిగావుందాం... యీ దిక్కుమాలిన జీవితం యిట్లా ఎంతకాలం గడుపుతావు. నేను ఓర్వలేను... రా..."

వీరభద్రం బలవంతం చేయటం మొదలెట్టాడు. ఆమె ఎన్నోవిధాలుగా నచ్చచెప్పింది. అతను వినిపించుకోవటంలేదు ... బ్రతిమిలాడింది. కంటనీ రెట్టుకుంటోంది. అతను లెఖచేయటంలేదు... పైగా భయపెట్టడం సాగించాడు. ఆమె ఓడిపోయింది...
"యింకా వస్నెందు కేడ్పిస్తావ్ వీరభద్రం, నీవని

నాజీవితం సర్వనాశనమైపోయింది. నా భర్తని చెడగొట్టి, దుర్వ్యసనాల పాలుచేసి, నా మంగళసూత్రం తెంచావు, నా పసుపుకుంకుమల్ని దూరంచేసావ్. నీవల్ల, చెడుమనిషి ననిపించుకున్నాను. ఎన్నో అపవాదులు పడ్డాను. నీమాయమాటలకి లొంగిపోయి 'నా' అనేదృష్టితో — బంధువుడివనీ - బావవనీ - చనువిచ్చి మాట్లాడాను. చివరకు నన్నీవిధంగా, హింసలపాలు చేసావు. నోటికాడి కూటిని పోగొట్టుకునేలాగు చేసావు. హాయిగా గడుస్తున్న మా సంసారానికి, నిప్పుపెట్టావు. నన్ను అన్నిందాలా యిబ్బందులపాలు పెట్టావు. యిప్పటి లేని విధంగా, కొంత ధైర్యంతో బ్రతుకుతున్నాను అపనిందలని భరించుకుంటూ - ఒక దాసీదానిలాగా - ఒక పనిమనిషిలాగా - మనోవర్తి పుచ్చుకునే ముసలిదానిలాగా ప్రాణాల్ని నిలబెట్టుకొని, జీవిస్తున్నాను. యింకా ఎందుకు నాకోసం తాపత్రయ పడతావ్? ఏముందని, నన్ను వెంటాడుతున్నావ్" - భోరు భోరున ఏడుస్తూ, వీరభద్రం వదిలిపెడతాడేమోఅనే ఆశతో, అంటోంది. వీరభద్రం విసుగెత్తిపోతున్నాడు. ఆ మాటలు అల్లసాలసంగా, యింట్లోకి వెళ్ళినయి. జయలక్ష్మికి వినిపించినయి. మెల్లిగా లేచివచ్చి ఓరవాకిలిగుండా చూసింది. శారద గోడు గోడున ఏడుస్తూ, అరుగులమీద కూర్చొనివుంది... వీరభద్రం భయపెడుతున్నాడు.

"నువ్వుగనుక, యీరాత్రి నాతోకట రాకపోయే పక్షంలో, యీయింట్లో నీకు తావు నీడా లేకుండాచేస్తాను. నువ్వుచేసిన పాడుపనిని, మీ జగన్నాథం బావకీ, దుర్గమ్మక్కయ్యకీ - ధర్మారావుకీ చెబుతాను. నిన్ను వీధిలోకి, తరిమగొట్టేలాగు చేస్తాను. నీచీకటి పాపం ఆనాటితో పోయిందనుకున్నావేమో! లేదు. నేటితోపోయే ట్లుచేస్తాను. వస్తావా మర్యాదగా రా, లేదంటావో, నీవిషయాన్ని రచ్చకెక్కించి, గోలచేసి, మరీ తీసుకొనివెడతాను. నువ్వొచ్చేదాకా నేనీ యిల్లుకదలను. నువ్వుచేసిన పాడుపనిని అందరికీ చెబుతాను. న్యాయం అప్పుడే తేలుతుంది. అప్పుడెవరికోసం వస్తావు...నలుగురూ వుమ్మేస్తారు. దేవుడా! అంటూ, మళ్లీ నావద్దకేవస్తావు. అంత రభసజరుగకముందే లేచిరా...మర్యాదగా చెబుతున్నా. యిప్పటికే చాలా పొద్దుపోయింది." - వీరభద్రం కనిగ్రహంకన్నా గట్టిగాపట్టుకొని పీడించసాగాడు. యీమాటలన్నీ జయలక్ష్మి జాగ్రత్తగా సేవింది. ఏంచేయాలో తోచలేదు. వెంటనే, దొడ్లోకివెళ్లి, ప్రక్కింటి యజమానిని లేపుకొచ్చింది. యీలోపుగా శారద, అతనికాళ్లు పట్టుకొని ప్రార్థిస్తోంది. అతను రమ్మనమని చేయిపుచ్చుకొని లాగుతున్నాడు. ఆసమయంలో వీరభద్రం తలకాయ ఫెటేల్మంటూ; వీపుమీద రెండు మూడు దెబ్బలు పడినయి. 'అమ్మో' - అంటూ, వీరభద్రం, వాకిటి ముందు పొర్లిపోతూ పడ్డాడు. శారద, తటాలున ప్రక్కకి తప్పుకొని, జయలక్ష్మి వద్దకొచ్చి, వెక్కి వెక్కిమంటూ చూసింది. వీరభద్రం పడినవాడల్లా లేవటానికి ప్రయత్నిస్తున్నాడు. యింతలో చుట్టు ప్రక్కల వాళ్లంతా పోగై, బండి మేకు తెచ్చి వీరభద్రం కాళ్లుచేతుల్ని వెనక్కి విరగ కట్టేసారు. తీసుకొచ్చి, ఒకగుంజకి కట్టేస్తూ, నానా మాటలూ అన్నారు. అతను తలవంచుకొని గుండెల్లో దాచుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ సమయంలో, వాకిటి ముందంతా జనం చేరి, గోల గోలగావుంది. రామకృష్ణ లేచి,—

"అమ్మా!" — అని ఏడ్చాడు. జయలక్ష్మి ప్రక్కకి తిరిగిచూసింది. శారద కనిపించలేదు.— కంగారుపడింది.

"చిన్నత్తయ్యా" — అని పొలికేక పెట్టింది. యిల్లంతా ప్రతిధ్వనించింది. వాకిటిముందు జనం పల్చపల్చనవుతున్నారు. జయలక్ష్మి, రామకృష్ణణ్ణి చంకనవేసుకొని, యిల్లంతా - గదులన్నీ - దొడ్డంతా చెట్లచాటున - నూతిప్రక్కన - నూతిలోనూ - తరిచి, తరిచి చూసింది. శారద జాడలేదు. రామకృష్ణుడు 'అమ్మా - అమ్మా' - అని, జయలక్ష్మిని వేధిస్తున్నాడు. ఎంతచూసినా దొడ్డిలో శారద ఆచూకీ తెలియలేదు... కాని, దొడ్డితలుపులు బార్లాగా తెరువబడివున్నయి. గాలికి వూగుతున్నయి. జయలక్ష్మి సరాసరి వెళ్ళిచూసింది - ఎవ్వరూ తిరుగుతున్నట్లు జనసంచారంలేదు. చీకటి దట్టంగావుంది. తెల్లవారటానికి యింకా చాలా కాలవ్యవధివుంది... అందుకే, యిక తనజీవితం, ఎలాగూ రచ్చకెక్కుతుందని భావించి, జయలక్ష్మి ముఖం చూడటానికి చెల్లక, ఆయింట్లో వుండటానికి మనస్కరించక, కన్నకొడుకుని వదిలేసి, చీకటి తెరలగుండా శూన్యంలోకి దూసుకొని, శారద వెళ్ళిపోయింది. -

# శ్రీ రా మ క ర్ణా మృ త ము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు

(గతసంచిక తరువాయి)

**౨౨**

ప్రియులగు చెలికాండ్ర వేడుకఁగూడుచు
బాల్యంబు గడపిన వాఁడ వీవు!
పూర్ణ చంద్రుని వంటి - ముద్దుమోమును గల్గి
పీతాంబరంబును ప్రీతిఁదాల్చి
నీల మేఘశ్యామ! నిఖిల చరాచరం
బులకు, గురుండవై - ముద్దుగాఁగ
సోదరుల్ భృత్యులై - సుఖముగా నీసేవ
సలుపు చుండంగ, నా జాను బాహు
యుగళమునుగల్గి, శ్రీరామ! నిగమవినుత!
వెలయు చున్నావు భక్తిసేవింతు నిన్ను
పాప సంసార భయముల బాయఁజేసి
చిత్త శాంతినొసంగుమా శ్రీనివాస!

**౨౩**

వైదేహిరమణీయ పద్మముఖమునకు
ఖద్యోతుఁడై నీవుగ్రాలినావు
రత్న దీపములచే - రంజితంబైన, కే
ళీ గృహంబుననీవు లీలతోడఁ
బరిమళ పుష్పసంభరితమౌ పాన్పుపై
శయనించి భార్యతో సౌఖ్యమంది
రఘువంశజలనిధి - రత్నమై శ్రీ రామ!
సుప్రకాశముతోడ - సుందరాంగ!
వెలయు చున్నావు; రఘుపతీ! విష్ణురూప!
చిన్మయానంద! గోవింద! శ్రీముకుంద!
నిన్ను సేవింతు, భజియింతు, నిర్మలాత్మ!
నన్ను రక్షింపుమయ్య! సంపన్నచరిత!

**౨౪**

వారిధి బంధించి - వనచరులను గూడి
లంకాపురముఁజొచ్చి శంక లేక
కుంభకర్ణాదులఁ గూల్చి, రాక్షసమూక
నేల మట్టమొనర్చి, నిగమవినుత
రావణుఁబరిమార్చి యావిభీషణుని, లం
కారాజ్యముననిల్పి, కాంత సీత
తోఁబుష్పకమునెక్కి, తోషంబుతోడ న
యోధ్యకు వేంచేసి యోగివినుత
రామ! భూరాజ్యము వహించి, క్షేమముగను
ప్రజలఁ బాలించి నావు, సంబరముతోడ
నిన్నుఁ ప్రార్థించి సేవింతు సన్నుతాంగ!
చిన్మయానందమొసఁగు మా శ్రీరమేశ!

**౨౫**

రత్న కుండల కాంతిచే - రమ్యమైన
గండ బాగముల్ గల్గి, కోదండరామ!
నుదుటఁగస్తూరి బొట్టు సంపదను గల్గి
విమల, కర్ణాంత దీర్ఘ నేత్రములతోడ

సొగసు గుల్కెడి శ్రీరామ! సుందరాంగ!
వరద! కరుణా కటాక్షముల్ ప్రసరజేసి
నాహృదయమందు వసియించి నాగశయన!
నిత్య సంతోష మొసఁగుమా నీరజాక్ష!

20

శివ ధనుర్భంగంబుఁ జేసిన వాఁడవు
నిఖిల రాజులు నిన్ను నెమ్మిఁ జేరి
మణికిరీటములచే - మానితంబైనట్టి
శీర్ష భాగములతో - హర్షమలర
నిను మ్రొక్కుచున్నారు నీరజలోచనా!
ఇన కుల దీపకా! ఇందిరేశ!
లాలితంబైన, కల్యాణలీలోత్సవ
ములచేత సతతంబు ముదముతోడఁ

వెలుఁగుచున్నావు సీతతో శ్రీశుభాంగ!
గొప్ప వైభవ మూర్తివై - కొమరు మీఁటి
యున్నవాఁడవు - భజియింతు సన్నుతింతు
చిత్తశాంతి నొసంగి రక్షింపుమయ్య!

(సశేషము)

# భక్తియోగ నిరూపణం

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

[తిరుమలపయి యేటేట జరుగు వేసవితరగతులు (Summer Classes) ఈసారి జరుగు సందర్భాన్ని పురస్కరించికొని, (8, 9, మే నెలలో,) పై విషయాన్ని గూర్చి ఉపన్యసించటానికి ఆహూతుణ్ణై అయి యిచ్చిన ఉపన్యాస సారాంశం]

ముక్తిసాధనాలుగా ప్రాచీనమహర్షులు నిరూపించిన యోగమార్గాలు మూడు. అవి భక్తి, కర్మ జ్ఞాన యోగాలనబడుతున్నాయి. ఈ మూటిలోను అందరికీ అందుబాటులో ఉండేదీ, సులభమయింది భక్తియోగం. అది ఆధ్యాత్మికంగా, ఆధిభౌతికంగా మానవులను తరింపజేస్తుంది. కనుక తక్కిన రెంటికీ ఆధారభూతంగా భక్తినే, జ్ఞానకర్మయోగాలకు పునాదిగా వేదాలు చెప్పుతున్నాయి.

'భక్తి' అంటే, నిర్వ్యాజంగా, ఒకవస్తువును త్రికరణశుద్ధిగా ప్రేమించటం. భక్తి ప్రేమస్వరూపం. అది పాత్రానుగుణంగా నానారూపాదుల్లో భిన్నత్వం వహిస్తుంది. భక్తి అనేది (లేదా ప్రేమ) పిల్లల విషయంలో వాత్సల్యరూపం; పెద్దలయెడల వినయరూపం; దంపతుల్లో పరస్పరానురాగరూపం. మిత్రబాంధవులసందర్భంలో ఆదరాభిమానరూపం. దీనజన - ఆశక్తుల ప్రశక్తిలో దయారూపం. అది ఆధ్యాత్మికంగా, అతీంద్రియస్థితికి వస్తే, భక్తి-రూపం. అట్టి మానవాతీతమయిన హృదయపూర్వక భక్తి - (భక్తియోగసాధకుల దృష్టులను) భగవంతుని పైకి కేంద్రీకృతం చేస్తూ, మఱి యితరాల మీదికి ఎంతమాత్రం పోనీదు. అట్టి భక్తినిగూర్చి శ్రీకృష్ణ భగవానుడు గీతలో అర్జునుడికి బోధిస్తూ - "అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం" — అని సెలవిచ్చినాడు. భగవంతుడిపై అచంచలంగా నిలిపిన చూపు మఱొకరిమీదికి మరలదు. మరలకూడదు. అది త్రికరణశుద్ధం కావడం చేత — వ్యభిచారిణి కారాదు, 'భక్తిరవ్యభిచారిణీ' — అని మహర్షుల శాసనం. మానవహృదయాన్ని భగవత్పరం చేసిన తరువాత, ఆ భక్తి సర్వకాల పర్యావస్థాశ్రయం అయి, యోగసాధకుని బుద్ధి పరవస్తు త్రొక్కనీదు.

## తక్కిన యోగాల ప్రాముఖ్యం

గార్హస్థ్యజీవితం నడిపేవారికి కర్మయోగం సాధ్యంఅవుతుంది. అతడు తనగార్హస్థ్యాన్ని నిలుపుకోవటాని కొన్నో కర్మలు ఆచరించవలె. పుట్టింది మొదలు చచ్చేటంతవరకు గృహస్థు కర్మబద్ధుడే. జాతకర్మతో ప్రారంభమయిన భారతీయ జీవితం అపరకర్మతో ముగుస్తుంది. అంటే, గర్భంలో ఉండేటప్పుడే, తల్లికి సీమంతోన్నయనానికి కారణభూతుడైన హైందవుడు మరణానంతరంకూడా శ్రాద్ధాది కర్మలను వేదశాస్త్రాలవల్ల లోగవలసి వస్తున్నది. అతడు జరిపే షోడశకర్మలు అందు చాలాముఖ్యాలయినవని, అవి అయినా జరుపనివాడు అతడు కర్మబాహ్యుడని ఆర్యులు ఉద్ఘోషించారు. కర్మలనేవి గృహస్థు - తన త్రికరణశుద్ధికై అవలంబించే పవిత్ర సాధనాలు. షోడశకర్మలు - స్వార్థానికయితే, ఎంతో ఉపకరిస్తవి. పరోపకారానికూడా "లోకాస్సమస్తా స్సుఖినో భవంతు" - అని కొన్ని కర్మలు అతడు నెరవేర్చగలిగినపుడే, అతని గార్హస్థ్యానికి సార్థకత సిద్ధిస్తుంది. అతిథ్యర్చనం, అభ్యాగతారాధనం, యజనయాజనాలు, అగ్నిహోత్రపూజ భూతబలిప్రదానం, సప్తసంతాన నిర్మాణం — ఇవన్నీ గృహస్థుకు ఇహపరసుఖాలను చేకూర్చేవి. కాని, ఇట్టి కర్మలు జనధనతనూబలాలు గలవాళ్ళకే తప్ప - తదితరులకు నెఱవేర్పరానివి. క్రతువిధ్వంసకులయిన రాక్షసులను నిర్మూలించటానికి జనబలం తక్కువ కావటంచేతనే విశ్వామిత్రుడు

దశరథసుతులను కోరినాడు. విశ్వజిద్యాగానికి పూనుకొని రఘువు తనసంపదల నన్నిటిని దానం చేయటం చేతనే, కౌత్సుడు తన్నుయాచించేటప్పటికి ధనబలం లేకున్నా అతడికి తాను వాగ్దత్తం చేసిన సొమ్ము ఇవ్వటానికి గురువును ఆశ్రయించి ఆయన వల్ల మాట నిలుపుకొన్నాడు. తనుబలములేని అస్థి పంజరంమాత్రంగా తపస్సమాధిలో ఉన్న దధీచి, తన్ను వెన్నెముక కోరిన దేవతలకు దాన్నియిచ్చి నంటే, నాకేలాగూ - తన్ను ముగించి అయినా తీసుకొని వెళ్లగలరని ప్రాణత్యాగమే చేసినాడు.

జ్ఞానయోగం విజ్ఞానవంతులకు మాత్రమే అందుబాటులో ఉంటుంది. వేద వేదాంగోపనిషద్భాగంబ్రాహ్మణములు క్షుణ్ణంగా అర్థం చేసికోవడం ఒక యెత్తు—దాన్ని ఆచరణకు తెచ్చుకోవడం మరొక యెత్తు. వేదాంతగ్రంథాలలోని సూత్రాలను వల్లె వేయటంతో జ్ఞానోదయ మయిందని అనుకొనేవాడి కంటే అజ్ఞాని ఈప్రపంచంలో లేడు. గురుముఖత, విపులవ్యాఖ్యానాలతో జ్ఞానప్రవచనాలు అవగాహనచేసికొని, ఆయుపదేశకుడి యనుభవసిద్ధాంతాలను ఆయనద్వారానే మనస్సున నిలుపుకొని, ఆచరణలో వాటిని పెట్టడానికి అభ్యాసపడవలె. ఇది ఉన్నిద్రమనస్కులకేగాని ఇతరులకు సాధ్యపడని విషయం. ఏకోన్ముఖంగా, తనదృక్పథంలోని సకల తత్వాన్ని నిశ్చలచిత్తంతో విజితేంద్రియుడై అంతర్విలోకనం చెదరకుండా ఉండే వ్యక్తి జ్ఞానయోగాన్ని సాధించగలడు. అతడు "నీవార శూకత్తన్వీ పీతాభాస్య త్వణూపమా" అని వేదవిదులు చెప్పిన తేజోరూపమును సందర్శించి ధన్యులు కాగలరు. ఇందులకు ద్వంద్వాతీత ప్రవృత్తి, అచంచలదీక్ష, సంగపరిత్యాగము అత్యంతం సహకారులు. జ్ఞానయోగుల ముక్తిసాధమునకు మొదటి సోపానము ప్రాణాయామము. రెండవది ఆసనాభ్యాసము. మొత్తముమీద కర్మయోగము ఎంతటి కష్టసాధ్యమో, ఈజ్ఞానయోగమును అంతటి కష్టసాధ్యమయినదే.

ఇక భక్తియోగ విషయాన్నిగూర్చి ఆలోచిస్తే - అది విద్యావంతులకు అవిద్యావంతులకు గూడా సులభంగా అవలంభించతగింది. దీన్నిగూర్చి :—

1. "ఎవరు నాయందు తమమనస్సును లగ్నం చేసి, సంపూర్ణమయిన విశ్వాసంతో నన్ను స్థిరంగా సేవిస్తారో, వారే భక్తియోగులు" అని కృష్ణభగవానుడు.

2. "భక్తియోగం సాధించేవారికి అచంచలమయిన భగవత్ప్రేమ మిక్కిలిముఖ్యం. అప్రేమ అమృతస్వరూపం. కాన దానికి వినాశనంలేదు" అని నారదుడు—అతడే ఇంకా,—"యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధోభవతి"—అనగా, "అది సాధించిన మానవుడే సిద్ధుడు ; అమర్త్యుడు ; సంతృప్తుడు".

3. "యత్ప్రాప్య నకించిద్వాంఛతి ; నశోచతి ; నద్వేష్టి ; నరమతి ; నోత్సాహీ భవతి." అనగా, "భగవత్ప్రేమను సాధించినవానికి కోరికలుగాని, చింతలుగాని ఉండవు. ద్వేషముగాని, సంతోషముగాని ఉండదు. స్వార్థప్రయత్నముగాని, ఉత్సాహముగాని ఉండదు.

### భక్తుని లక్షణము :-

1. "యద్జ్ఞాత్వా మత్తోభవతి, స్తబ్ధో భవతి, ఆత్మారామోభవతి," - అనగా, భక్తియోగమును గ్రహించి యనుభవించువాడు పారవశ్యమును పొందును ; ప్రశాంతస్థితిని పొందును ; ఆత్మారాముడగును ; ఏలయన - అభగవద్భక్తి తన్ను నిరోధించువానిని అరికట్టును.

2. "తస్మిన్ అనన్యతా తద్విరోధిషూదాసీనతా". అనగా, భగవద్భక్తి అన్నప్పుడు, ఆయనకు పూర్తిగా తన్ను అర్పించుకొనటం, 'అనన్యతా' అనగా, ఆయననుతప్ప మరెవ్వరినీ ఆశ్రయించకుండా వుండటం."

3. ఈ నారదుని భక్తిసూత్రాన్నే—శ్రీకృష్ణుడు "అనన్యాశ్చింతయంతః" అనే శ్లోకం మూలంగా బలపరుస్తున్నాడు.

# పొగత్రాగుడు, మద్యపానం, క్షయ

శ్రీ డాక్టరు పి. వి. బెంజామిన్

ఇటీవల యెందరో పొగపీల్చడానికి, కాన్సర్ వ్యాధికి యెక్కువ సంబంధం వున్నదని తెలుసుకున్నారు. అనేక రాష్ట్ర శాసనసభల్లో మద్యనిషేధం బిల్లులను ప్రవేశపెట్టడం, ఆమోదించడం జరిగింది. ప్రజల ఆరోగ్య విషయంలో ఆసక్తికలవారు పొగత్రాగడం, త్రాగుడు మొదలైన అలవాట్లకూ క్షయకూ వుండే సంబంధమేమిటని అడగడం సహజం.

భారతదేశంలో యీ విషయమై ఎలాంటి పరిశోధనలూ చేసినట్లు తోచదు. కాని యీ విషయాలపై యితరదేశాల వారిచ్చిన వాటిలో కొన్ని విషయాలు చాల బాగున్నాయి.

## పొగపీల్చడం, క్షయ

పొగత్రాగడం యెక్కువగా అలవాటున్నవారికి ఊపిరితిత్తుల్లో కాన్సర్ వ్యాధి వస్తుందన్న విషయం అందరికి తెలిసినదే. దీనికి కారణం యేమిటంటే పొగ గొంతులోను శ్వాసనాళికలలోను ప్రవేశించి ఒక విధమైన 'నుస' పెట్టుంది. దీనివల్ల దగ్గు అధికమౌతుంది. దీంతో క్షయవ్యాధి తగ్గదు సరికదా, అణిగిపోయిందేదైనా వుంటే, అది పైకొస్తుంది.

బర్మింగ్‌హాంలో డాక్టర్ సి. ఆర్. లోవి తన నగరంలో ౧,౨౦౦ మంది పొగత్రాగడానికి అలవాటుపడ్డ క్షయరోగుల్ని పరీక్షించారు. పొగ మరీ యెక్కువ అలవాటుండే వారే క్షయరోగుల్లో అధికంగా వున్నారు. పొగ అలవాటులేనివారిందులో చాలతక్కువమంది. దీన్నిబట్టి చూస్తే, క్షయరోగులు కూాసపికంగా యెక్కువ బాధపడడంవల్లా, యెల్లప్పుడూ మందులతో నలిగిపోవడంవల్ల పొగత్రాగడం యితరులకంటే యెక్కువగా అలవాటు చేసుకున్నట్లు తెలుస్తుంది. కనుక క్షయరోగులకు పొగమానేయమని సలహా యివ్వడం ముఖ్యం.

త్రాగుడు అలవాటువిషయంలోకూడా దేశంలో త్రాగుడు క్షయకూ యెలాంటి సంబంధం ఉన్నది చెప్పడానికి మనకే ఆధారాలు లేవు.

## త్రాగుడు, అలవాటున్న వారిలో క్షయవ్యాధి

ఇల్లినాయిస్ రాష్ట్ర ప్రజాసంక్షేమశాఖ డైరెక్టరు, డాక్టర్ బట్లో ఎల్. బెట్టాగ్ తన పరీక్షలో, ౧,౦౦,౦౦౦ మంది త్రాగుబోతులలో ౨,౩౦౦ మంది క్షయవ్యాధిగ్రస్తులనీ ఇల్లినాయిస్ రాష్ట్ర జనాభా మొత్తంమీద ప్రతి ౧,౦౦,౦౦౦ మందిలో ౭౮ మంది మాత్రమే క్షయరోగులనీ తెలుసుకున్నారు. క్లీవ్‌లాండు నగర ఆసుపత్రిలోని క్షయరోగుల విభాగంలో చేసిన పరీక్షలవల్ల అక్కడికివచ్చిన క్షయరోగులలో కనీసం నూటికి ౨౭ మంది త్రాగుబోతులేననీ తేలింది. ఈ రెండు పరీక్షలనుబట్టి చూస్తే సామాన్య జనంలోకంటే త్రాగుబోతుల్లోనే యీ వ్యాధి యెక్కువగా ప్రబలి వుందని తెలుస్తుంది.

త్రాగుబోతులద్వారా యీ వ్యాధి యెక్కువగా ఒకరినుండి ఒకరికి ప్రాకుతుందన్న విషయాన్ని గ్రహించాలి. త్రాగుబోతులందరూకూడా ఎక్కడపడితే అక్కడ ఉమ్మేయ్యడం మున్నగు పనులు చేస్తూ, ఆరోగ్యసూత్రాలను పాటించరు. ఇలాంటి వారు తప్పక తమవ్యాధిని యితరులకు అంటిస్తారు. త్రాగుడలవాటుండే వారు చాలమంది పొగ పీలుస్తుంటారు. క్షయవ్యాధిగ్రస్తులు స్నేహబృందంలో ఉన్నాడిగా పొగ త్రాగుతూ మద్యం సేవిస్తూ ఉంటే వారిలోకూడా ఈ వ్యాధి ప్రాకుతుంది అని అనడంలో యేలాంటి అతిశయోక్తి లేదు.

### సామాన్య పిర్యాదులు

త్రాగుబోతులు పొగ అలవాటుండే వారు సామాన్యంగా ఆహార విషయంలో యేదో ఒకపిర్యాదుచేస్తుంటారు. వీరు సాధారణంగా తమకాకలి కావడంలేదంటారు. దాంతో సరిగా తినరు. అంతే కాదు, సరైన ఆహారాన్నికూడా పుచ్చుకోరు. దాంతో శరీరం, రోగాల్ని దురోక్కవడానికి కావాల్సిన సత్తువను కోల్పోతుంది. ముఖ్యంగా క్షయను యెదురోక్కలేకపోతుంది.

తాగుబోతు క్షయరోగి త్రాగుడు మానకపోతే వ్యాధి మరీ యెక్కువవుతుంది. దీనివల్లవారికి చికిత్స చేయడం కూడా కష్టం, అంతేకాకుండా వీరు యితరుల్లాగా క్షయనుండి త్వరగా కోలుకోలేరు.

త్రాగుడుగానీ, పొగ అలవాటుగానీ వీలైనంతవరకూ తగ్గించడం మంచిది. 'అతి సర్వత్ర వర్జయేత్' అనేది అందరికివరిస్తుంది. ముఖ్యంగా క్షయవ్యాధి పీడితులకు.



## పరిచయం



కుమారి రేణుక వయస్సు 14 సంవత్సరాలు. గత రెండు సంవత్సరాలుగా యీమె శ్రీ మనోహర్ డ్రామాకంపెనీలో ప్లేబ్యాక్ సింగర్ గా పని చేస్తోంది. చిన్నప్పట్నించీ సంగీత సాధనం చేసింది.

ఈ మధ్య "[illegible]" అనే మలయాళ సినిమాలో మూడు రికార్డులు యిచ్చింది. నీలా ప్రొడక్షన్స్ వారు నిర్మిస్తున్న ఒక తమిళ సినిమాలో (పేరు యింకా నిశ్చయంకాలేదు) శ్రీ బ్రదర్ లక్ష్మణ్ సంగీత దర్శకత్వంక్రింద రెండు పాటలు పాడింది. ఇంతేకాకుండా మెజెస్టిక్ పిక్చర్స్‌వారు నిర్మించి త్వరలో రిలీజు చేయనున్న తమిళ చిత్రం "నాట్టుక్కొరు నల్లవళ్"లో శ్రీ వేణు సంగీత దర్శకత్వంక్రింద ఒక రికార్డుయిచ్చిందికూడ. దీనికితోడు సుభాష్ మూవీస్ అనే తమిళ సంస్థవారు నిర్మిస్తున్న ఒక చిత్రానికి శ్రీయుతులు విశ్వనాథం, రామ్మూర్తుల సంగీత దర్శకత్వంక్రింద కుమారి రేణుక శ్రీమతి జమునారాణితో కలిసి పాడింది.

కుమారి రేణుక ఇపుడు తెలుగు చిత్రాలలో పాటలు పాడాలని కుతూహలం కనబరుస్తోంది. తెలుగు తెరకు కొత్త ప్లేబ్యాక్ గాయకిని పరిచయం చేయాలనే ఉత్సాహంగల నిర్మాతలు కుమారి రేణుకకు ప్రోత్సాహం యిచ్చెదరుగాక.

(344 వ-పేజి తరువాయి)

మర్నాడే గోపాలం శంకరానికి ఉత్తరం వ్రాశాడు. మీనాక్షమ్మకి పక్షవాతం వచ్చిందని.

శంకరం చూడటానికి వచ్చాడు. భోజనాల యింతర్వాత,

"నాతోరా అమ్మా." అన్నాడు శంకరం తల్లి దగ్గిర కూర్చుని.

తల్లి ముభావంగా విని విననట్టు ఊరుకున్నది.

కుర్చీ అడిగాడు.

"నేను రానురా" అంది.

శంకరం నిరాశగా వెళ్ళిపోయాడు.

అప్పట్నే అవిడ పాట్లు ఆరంభమైనయి. విమల సూటిపోటీలుగా మాటలనటం మొదలు పెట్టింది.

గోపాలం అదివరకు ప్రతిరోజూ తనని చూడటానికి వచ్చేవాడు. ఇప్పుడు రావటంలేదు. ఎప్పుడో వారానికో రెండుసార్లు చూడటానికి వచ్చేవాడు. ముభావంగా మాట్లాడేవాడు.

విమల తనువచ్చి అత్తగారిని చూసేదికాదు. అన్నం వంటమనిషి తెచ్చిపెట్టేది. స్నానానికి పని మనిషి లేవదీయాల్సి వచ్చింది చివరికి.

మీనాక్షమ్మ కేమి తోచలేదు. "గోపాలాన్ని రమ్మని చెప్పమ్మా ఒకసారి" అంది పనిమనిషితో.

అది "అయ్యగారు, అమ్మగారు సినిమాకెళ్ళారు" అంది.

మీనాక్షమ్మ నిట్టూర్చింది!

ఆరాత్రి ఆమెకు అన్నం, ఎవరు తెచ్చిపెట్టలేదు. చివరికి పనిమనిషిని బ్రతిమిలాడి శంకరానికి ఉత్తరం వ్రాయించింది.

శంకరం వచ్చాడు ఉత్తరం అందగానే.

శంకరాన్ని చూసి బోరున ఏడ్చింది మీనాక్షమ్మ

"నన్ను ఈ నరకంలోంచి తీసుకుపోనాయనా?" అంది ఏడుస్తూ.

"అమ్మని తీసికెడతాను." అన్నాడు శంకరం గోపాలంతో

"నీయిష్టం. తీసుకెళ్తే తీసుకుపో ఇక్కడ చేసే వాళ్లుకూడా లేరు." అన్నాడు గోపాలం.

"కన్నకొడుకుని నమ్మినందుకు తగినశాస్తిచేశాడు అనుకుంది మీనాక్షమ్మ.

టాక్సీని పిలిచాడు శంకరం.

శంకరం తల్లిని రెండుచేతులతో పట్టుకున్నాడు. టాక్సీలో కూర్చోబెట్టాడు.

"పోయొస్తానాయనా." అంది జాలిగా మీనాక్షమ్మ.

"ఊ! ఉండమంటున్నావుందవాయే." అన్నాడు కొడుకు జాలిలేకుండావచ్చి.

కోడలు అక్కడ కనిపించలేదు. మీనాక్షమ్మ జాలిగా రెండు మూడు సార్లు చూసింది అటువైపు.

టాక్సీ కదిలింది.

సరోజ పక్క ఏర్పాటుచేసింది. శంకరం, సరోజ మీనాక్షమ్మని పక్కమీద పడుకోబెట్టారు.

టాక్సీవాడికి ఇరవైఅయిదు రూపాయలు ఇస్తూ శంకరం గాఢంగా నిట్టూర్చాడు.

ఉన్నట్లుండి మీనాక్షమ్మకి రెండోవైపుకి గూడా వచ్చింది పక్షవాతం.

మందు మింగుడుపడదు! ఆహారం లోపలికిపోదు.

శంకరం ఇంజక్షన్లకి ఇంజక్షన్లు కొనుక్కొచ్చాడు. తల్లికి ఏలోటు రాకుండా చూస్తున్నాడు.

అర్ధరాత్రి! ఎటుపోయి ఎటువస్తుందోనని నర్సుని పెట్టాడు మీనాక్షమ్మని.

ఉన్నడబ్బాయిపోయింది. ఇంట్లో నగలు నిండుకున్నయి!

సరోజమెళ్ళో గొలుసు ఒక్కటి తీసిఇచ్చింది. ఆ ఒంటిపరస గొలుసుచూసి శంకరం ఏడ్చాడు.

"ఎందుకండీ అట్లా ఏడుస్తారు? మళ్ళా చేయించరా ఏం?" అంది ఓదారుస్తూ సరోజ.

"సరోజ! నువ్వుదేవతవు." అన్నాడు ఆవేశంగా.

మార్వాడీకొట్లో అమ్మేసి నలభైఅయిదు రూపాయలు తెచ్చాడు.

వస్తూవస్తూ, "నేనెంత అసమర్థుణ్ని" అనుకున్నాడు. కేలండరువంక చూసి, "ఇంకా ఏడో తారీకేనా" అనుకున్నాడు.

యాంత్రికంగా ఆఫీసుకి పోయాడుగాని మనసు ఇక్కడేఉంది!

సరోజకి భయంవేసేది ఆమెని చూస్తుంటే!

శంకరం ధైర్యంచెప్పేవాడు.

మీనాక్షమ్మ పోయింది!

పోయేటప్పుడు శంకరాన్ని చూసి ఏడ్చింది.

సరోజ ఎత్తిన ఆస్తి మాటవిని, "అంతా గోపాలానికే ఇచ్చింది లేకపోతే అమ్మని రానివ్వడు." అన్నాడు.

సరోజ మాట్లాడలేదు.

శంకరం చిన్నపిల్లాడిలా విలపించాడు.

సరోజ, "అత్తయ్యా!" అని కన్నీరు కార్చింది.

శంకరమే కొత్తకుండ పట్టుకుని నడిచాడు. శంకరమే చితికి నిప్పుపెట్టాడు.

కపాలమోక్షం అవగానే కుండలు పగలకొట్టి అందరూ ఇళ్ళకొచ్చారు.

శవాన్ని మొయ్యటానికి బ్రాహ్మల్ని పిలవాల్సి వచ్చింది! ఆ రాత్రి శంకరం మామగారు, "ఆస్తి నీకెంత ఇచ్చింది?" అన్నారు.

"ఏమీ లేదు. నా తమ్ముడికిచ్చింది." అన్నాడు శంకరం మామగారి ముఖంవైపు చూడకుండా.

మర్నాడు ప్రొద్దున, "కాశీగంగలో కలిపివస్తాను. అమ్మ అస్థులు." అన్నాడు సరోజతో.

"మీ ఇష్టం. నేనడ్డుచెప్పను." అంది.

అలాగే కాశీలో కలిపివచ్చాడు.

వెయ్యి రూపాయల అప్పును గురించి శంకరం బాధపడలేదు. కాని తండ్రిమాట ననుసరించి తల్లిని సంపగలిగానని తృప్తిపొందాడు.

ఇంట్లో అఖండం వెలుగుతున్నది.

---

# సదాచార సూత్రములు

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

1. పరమాత్మను సర్వదర్శిగా, నిజహృదయస్థునిగా భావించువాడు పాపకార్యం చెయ్యజాలడు.
2. దురభిమానంగల పురుషుడు స్వల్పకాలంలో నశించిపోతాడు.
3. పరమేశ్వరుడు మనంచేసే సత్కార్యాలకు మాత్రమే సహాయంచేస్తాడు.
4. సమస్తనిరాశలకు ఆశాభూతుడైన వాడు పరమేశ్వరుడొక్కడే
5. సద్భావంగల మానవుని హృదయం ఎన్నడూ దుఃఖించదు.
6. మానసిక దుర్మార్గధారణలే పతనానికి కారణభూతులు.
7. దృఢత్వాభిరుచులతో జరిగే కార్యాలు సాఫల్యసంభరితాలయి ఉంటాయి.
8. కర్తవ్యశీలుడైన మూర్ఖుడు కర్తవ్యశూన్యుడైన విద్వాంసునికన్న శ్రేష్ఠుడు.
9. ధనారోగ్యాలకన్నా సదాచారం అమూల్యమైంది.
10. మానవుడు నిజోన్నత స్వభావంవల్లనే ఉన్నతపదవీ ప్రతిష్ఠితుడు కాగలడు.
11. సజ్జనత్వ చిహ్నం మానవుడు సద్వ్యవహారంవల్ల ప్రతిబింబితమవుతుంది.
12. మానవుడు నిజమానసిక సద్వృత్తులను సుదృఢోన్నతంగా చేసుకుని ప్రయత్నం చెయ్యాలి.
13. స్వసద్గుణ ప్రభావంవల్లనే మనుష్యమాత్రుడు సర్వత్రా పూజింపబడతాడు. సద్గుణమే పూజనీయస్థానమనే విషయం సత్యమయింది.

# పరిణామము

**శ్రీ గాడేపల్లి శంకరం**

(గతసంచిక తరువాయి)

[illegible] రంగము

ప్రదేశం : మంత్రి మూర్తిగారి భవనం.
ప్రవేశం : మూర్తి-లలిత

సమయం: సాయంత్రం 4 గంటలకు
జనవరి 30-1948.

**మూర్తి:-** (ప్రవేశించి) లలితా ! లలితా ! (భయంకరమైన దుఃఖపూరిత స్వరంతో)

**లలిత:-** (ప్రవేశించి) ఆఁ ? (భయము ఆశ్చర్యమూ)

**మూర్తి:-** బాపూజీ మనకిక లేకుండాపోయాడు ! (గద్గదకంఠుడైపోతాడు)

**లలిత:-** ఆ ! ఏమిటీ ఘోరం ? (నిశ్చేష్టురాలవుతుంది.)

**మూర్తి:-** ప్రేయర మీటింగుకి పోతూవుంటే - హంతకుడెవడో కాల్చి చంపాడుట-

**లలిత:-** అయ్యో ! ఎంతఘోరం జరిగిందండీ ! (నిట్టూర్పు) ఒక్కక్షణం నిశ్శబ్దం.

**మూర్తి:-** మహాదారుణం జరిగింది-యేసుక్రీస్తు క్రైస్తవమతానికి-మహ్మదు మహమ్మదీయ మతానికి-బలి అయినట్లే - మహాత్ముడు మన అందరికోసం - బలి అయిపోయాడు.

**లలిత:-** నాటికీ నేటికీ - మానవలోకం ఒక్కలాగే వుందికదా !

**మూర్తి:** ఒక్కలాగేవుంది. ఎప్పుడూ ఇల్లాగేవుంటుంది.

**లలితా:-** ఈప్రపంచంలో (ఆవేశంతో) నూటికి తొంభైమంది ద్విపాదపశువులనతగిన మానవులుంటారు - పదిమంది మాత్రమే వివేకంగల ఉత్తములుంటారు - అందులో ఏటికీ కోటికి ఏ ఒక్కడో మానవాతీతుడైన మహాత్ముడుంటాడు - ఇది ప్రకృతి సహజమైన ప్రపంచ లక్షణం.

**లలితా:-** మహాత్మా ! నిన్ను చంపటానికి ఆకిరాతకునికి చేతులెల్లా వచ్చాయోగదా !

**మూర్తి:-** కిరాతకుడుకూడా అనటానికి అర్హతలేని ఓ మహాపాతకుడు చేయగలిగిన పని ఇది. సత్యాగ్రహోద్యమంతో-సహాయ నిరాకరణంతో శాంతి సమరం నడిపించి ప్రజల శత్రువును సహితం - పరమమిత్రునిగా చేసుకుంటూ-గాఢ నిద్దురలోనున్న ప్రజలను మేలుకొల్పి - స్వాతంత్ర్యం సంపాదించియిచ్చిన మహాపురుషునికి మనంచేసిన గౌరవం కాబోలు - ఇది. అహో హిందూదేశానికి - హిందూమతానికి హిందూజాతికి - తలవంపు - తీరనికళంకం.

**లలిత:-** అహింసా పరమోధర్మం అనుస్మృతి వాక్యాన్ని అంగీకరించడమే కాకుండా అక్షరాలా ఆచరించి చూపిన ఒక మహాపురుషుని కాల్చి చంపిన దుర్గతి - హిందూమతానికే-పట్టిందిగదా !

**దఫేదారు:-** (ప్రవేశించి) బాబూ - గవర్నమెంటు House నుంచి Phone వచ్చిందండి.

**మూర్తి:-** వస్తున్నా ! లలితా నేను వెడుతున్నాను. ఈ మంత్రిపదవిలో మహాత్ముని గూర్చి విచారించటానికికూడ సావకాశం లేదుగదా ?

**లలిత:-** అవును. వెళ్ళిరండి-అన్నీ చిక్కు సమస్యలే ! ఓమూల తిండికి బట్టకి కరువుగానుంది - దానికితోడు - ఇండియా పాకిస్తాన్ శరణాగతుల సమస్యకూడా ఒకటి వచ్చిపడింది.

**(మూర్తి వెళ్ళిపోతాడు-లలిత బాపూజీ పటందగ్గర పెట్టుకొని జాలిగా అతనివైపు చూస్తూ కన్నీరు కారుస్తూ (పాట పాడుతుంది)- వుంటుంది.)**

— తెర —

## పదిహేడో రంగము

—o—

ప్రదేశం:- ఒక మైదానంలో మీటింగు.
జనవరి 26-1950 ఉదయం. **Flag hoisting day-(Republic Day celebrations)**

ప్రవేశం:- శ్రీమూర్తిగారు - వారి సతీమణి లలితాదేవిగారు వేదికమీద కుర్చీలలో ఆసీనులై వుంటారు - దేశ సేవకులు - దేశసేవికులూ - పోలీసులు - ఇతర ఉద్యోగస్థులు - సభ నలంకరిస్తారు.

(పాట శ్రీకృష్ణశాస్త్రిగారిది)

"ఎగరేయ్ - ఎగరేయ్ ఎగరెయ్యి
వోయి జండా!
మనదీ - మనదే - మన మువ్వన్నియ
జండా!!"

కరతాళముల మధ్య శ్రీమూర్తిగారు లేచి

Ladies & Gentlemen! Let me thank you first for giving me this honour on this Historic occasion. I shall feel it my proud privilege to unfurl the National Flag which denotes a wide symbol behind it. We are celebrating the "Republic Day' today (ఉన్మత్తుడు లేచి అహ్హాహ్హా నవ్వుతాడు)

ఉన్మత్తుడు:- అహ్హాహ్హా నాటకమాడినారయ్యా నాటకం_

(సభలో కూర్చోకూర్చో అని కేకలు)

మూర్తి:- ఉండండి ఉండండి - వాడు చెప్పేది వినండి - ఆయన సామాన్యుడు కాడు - పర ప్రభుత్వదాస్యశృంఖలాలు భరించలేని కారణాన - పాపం ఉన్మత్తులయ్యారు - వారు భగ్న హృదయులైన స్వాతంత్ర్య సమరయోధులు - దేశ భక్తులు - బాబూ ఇలా - ఈ వేదిక దగ్గరకురండి.

ఉన్మత్తుడు:-(వచ్చి) ప్రపంచ చరిత్రలో మనం ఆడిన నాటకంకంటే గొప్పనాటకం మరెవ్వరూ ఆడలేదంటే - అతిశయోక్తి కాదు - విషాదాంతమా? వినోదాంతమా? అదీ కాదు - ఇదీ కాదు - అనంతం - అతిరథులు. మహారథులు అయిన సత్యాగ్రహసమరయోధుల నీవిప్లవోద్యమ వీరుల్ని పొట్టపెట్టుకొనడమే కాకుండా - ఈ మహా సంగ్రామాధినేతలైన మహాత్ములనుకూడా బలిగొన్నదిగా! అహా! విచారించనవసరంలేదు. విచారించి ప్రయోజనంలేదు. ఈప్రపంచం క్షణ క్షణమూ పరిణామాన్ని పొందుతూఉండటం - సహజం మరి - మతిపోయిన ముండావాణ్ణి మళ్ళీ వచ్చాను - క్షమించాలి. ఒక్కమాట మనవిచేసి మరీ పోతాను - మనదేశం పారతంత్ర్యమునుండి విముక్తయునదిగదా - స్వాతంత్ర్యము సిద్ధించింది. నూతన రాజ్యాంగం - అమలులోకివచ్చిన మహో పర్వదినం ఇది - అనేకకష్టనష్టాలకులోనై కుడక సంపాదించిన ఈ స్వాతంత్ర్యాన్ని సద్వినియోగ పరచి - భారతదేశాన్ని సకల సౌభాగ్యవంత మైనదిగా చేయవలసిన బాధ్యత మీమీదపడింది. రేయ్ ఇజముతేనా రానీయండి - రాకపోనీయండి. ఇది ప్రజారాజ్యం! యుక్తవయస్కులైన ప్రతిస్త్రీ పురుషుడికీ తన ప్రతినిధి నెన్నుకొనే హక్కుంది కాదూ - మీ ఓటును విక్రయించి దుర్వినియోగ పరచకండి - అలాగచేస్తే - పర్వత శిఖరాగ్రం మాటిన మీరు మళ్ళీ పాతాళలోకంలోకి పడి పోతారు జాగ్రత్త - అవతారపురుషుడొకడైనా రావలసివస్తుంది - జీవితావసరములైన కడుపునిండేటంత తిండి - వళ్ళునిండేటట్టు - ఉండటానికి ఇల్లు - మెదడుకి విజ్ఞానము సమకూర్చాలి - మిట్ట పల్లాలు లేకంచేయ నక్కర్లేదు - అయితే - మంచి చెడుగులు - కష్టసుఖాలు ప్రతిఫలాలు. పరమదుర్మార్గులు - స్వార్థపరులు - స్వార్థ త్యాగులు - ఈప్రపంచంలో ఉండతగినవారే - ఎప్పుడూ ఉంటారు. అందరూ - ఎప్పుడూ - ఒక్కటే కాలేరు. ప్రతి ఒక్కరికీ దాదాపుసాయాని. సమాన ప్రతిపత్తిగల - జీవన పరిమాణాన్ని సంపాదించటమే - తన పరమలక్ష్యంగా పెట్టుకొని - ఏ ప్రజాప్రభుత్వమైనా - సహస్ర శక్తులా పనిచేయవలసివుంది - ప్రజల తోడ్పాటు లేనిదే ప్రభుత్వంచేసే ఏర్పాటుల ప్రయోజనం ఉండదు - స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను - స్వసుఖానికీ - స్వప్రయోజనానికే కాకుండా - మత కుల ప్రాంతీయ విభేదాలు మరచిపోయి - త్రికరణ శుద్ధితో - ప్రజానీకమున కంతకీ శ్రేయస్సు చేకూర్చే మార్గాలన్వేషించండి - ఆమార్గాలు అనుసరించండి - అలాడుగాని మనం నిజమైన స్వతంత్రులమని అనుకోలేము - అప్పుడుగాని మనము కష్టపడి సాధించిన స్వాతంత్ర్యము సార్థకము కాబోదు - "దేశమంటే మట్టికాదోయి దేశమంటే మనుషులోయి" అన్నాడు మన గురు జాడ మహా కవి జ్ఞాపకంలేదూ? - దేశం కాను

పదాలన్నా ఉన్నత శిఖరాలందుకోవాలన్నా - స్వతంత్ర ప్రజలమైన మనం బాగుపడాలి!

ఏ పదిమంది పెద్దలో కోటానుకోట్ల ప్రజల గత్యం సిల్పుకుంటే సాగాలనుకోరాయి. జాగ్రత్త. ఈ రాజ్యం కర్షకులది. ఈ రాజ్యం కార్మికులది - ఈ రాజ్యం రామరాజ్యం, ప్రజలది. ఏ ఒక్కరి సొత్తూ కాదు. లక్షలాది ప్రాణాలు పలద సంవత్సరాలుగా బలియిస్తే వచ్చిన స్వాతంత్ర్యం. ప్రజలే ప్రభువులు - జై ప్రజాప్రభుత్వానికీ జై! జై! స్వతంత్రభారతికీ జై!! జై స్వాతంత్ర్య సమరయోధులకీ జై!!!

## భరతవాక్యం

భగవత్ప్రసాదితమైన నీదేహాన్ని శుచిగాను ఉండ రంగాను ఉంచుకొని - పుష్టికర ఆహారాన్ని తెంచినట్లే - ఆదేహాని కత్యంత అవసరమైన నీ గృహాన్ని - గృహోపకరణాన్ని - నీపల్లెని పట్టణాన్ని - నీయావద్భారతదేశాన్ని - ఆరోగ్యవంతముగా వుంచుకొని - ఆనందమయ జీవితాన్ని గడుపుదువుగాక! సాటిదేశాలలో సత్యమాన పురుషులుగా ప్రవర్తించెదవుగాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

—(o)—

# సినిమా న్యూస్

సుప్రసిద్ధ వర్తకి - తార వైజయంతిమాల జెమినీ పిక్చర్స్‌వారు నిర్మించనున్న తమిళ చిత్రంలో తన తల్లి శ్రీమతి వసుంధరతో నటించబోతున్నది. ఈ చిత్రంలో శివాజీగణేశన్, బి. సరోజాదేవి, టి. యస్. బాలా రాజు నటిస్తున్నారు. శ్రీ యస్. యస్. వాసన్ దర్శకత్వము.

♦ ♦ ♦

చందమామవారి 'సిపాయికూతురు' చిత్రము సెన్సారులోనున్నది. యీ నెలాఖరుకుగాని, ఆగష్టు మొదటి వారంలోగాని విడుదలగుతుందని రూఢిగా తెలుస్తున్నది.

♦ ♦ ♦

రాజ్యం పిక్చర్స్‌వారి 'కృష్ణలీలలు' విడుదలకు సిద్ధముగానున్నది. ఆగష్టు రెండవవారంలో వెలువడుతుందనుకుంటున్నారు.

♦ ♦ ♦

రాజశ్రీ ప్రొడక్షన్స్‌వారి 'శభాష్‌రాముడు' చిత్రము విడుదల కాబోతున్నది. ఇందులో యన్. టి. రామారావు, రేలంగి, రమణకుమారి, ఆర్. నాగేశ్వరరావు, మాలిని మొదలగువారు నటిస్తున్నారు. డైరక్టరు శ్రీ సి. యస్. రావు.

♦ ♦ ♦

పొన్నలూరి బ్రదర్స్‌వారి 'దైవబలం' తమిళ చిత్రం విడుదలయింది. త్వరలో తెలుగు చిత్రం వెలువడనున్నది.

♦ ♦ ♦

చంద్రికా పిక్చర్స్‌వారు 'శ్రీకృష్ణరాయబారము'ను శ్రీ తిరుపతి వెంకటకవుల పద్యములతో నిర్మించ బూనుకొన్నారు. మాటలు, పాటలు శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి. శ్రీ పి. సూరిబాబు పద్యములను పాడుతున్నారు. దర్శకత్వము శ్రీ జగన్నాథ్.




గోష్ఠి రజతోత్సవ సంచిక: గోష్ఠి కార్యాలయము వారు ప్రకటించినది. ఇది బ్రహ్మశ్రీ జి. వి. సుబ్బారావుగారి షష్ట్యబ్దిపూర్తి సందర్భమున వెలువడినది. ఇందులో అమూల్యమైన వ్యాసాలున్నవి. వెల 50 నయాపైసలు. ప్రాప్తిస్థానము గోష్ఠి బుక్ డిపో, అమలాపురం, తూ. గోదావరిజిల్లా.

---

చతుశ్లోకీ భాగవతము : శ్రీ శుద్ధచైతన్యస్వామి. ప్రాప్తిస్థానము: శ్రీ నారాయణ మూర్తి చైతన్య పాఠశాల, ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా. వెల 6 నయాపైసాలు.

చతుశ్లోకీ భాగవతమును శ్రీమన్నారాయణుడు బ్రహ్మకు, బ్రహ్మ నారదునకు, నారదుడు వేద వ్యాసునకు నుపదేశించెను. ఈ చిన్నపుస్తకంలో శ్రీధరస్వామి విరచితమైన సంస్కృతటీకతో గూడిన భాగవత శ్లోకములు, టిప్పణి, దానిక్రింద దీనికి శ్రీపోతన రచించిన తెలుగు భాగవతానువాదము, చివర వచనరూప వివరణ కలదు. చిన్నపుస్తకమైనా అమూల్యమైనది.

నేపాలయాత్ర (పశుపతి నాథము) : విద్వాన్ బులుసు సూర్యప్రకాశశాస్త్రి గారు. ప్రకాశకులు – సాధన గ్రంథమండలి, తెనాలి. వెల రు. 1-25.

పరమేశ్వరుని అష్టమూర్తులలో నొకటియగు పశుపతినాథుని చరిత్ర, నేపాలదేశ ప్రకృతిసౌందర్యమును యీ గ్రంథములో వివరించబడినవి. నేపాల్ యాత్ర బహువ్యయ ప్రయాసలతో కూడినది. ముఖ్యంగా సామాన్య ప్రజలు నేపాల్ దేశచరిత్రను, అందలి స్థల మహాత్మ్య విశేషములను తెలిసికొనుటకు యీగ్రంథము విశేషముగా నుపకరించగలదు. నేపాల్ దేశమందలి క్షేత్రములు, అందలి దేవతా ఉత్సవములు, ఆదేశమునకు సంబంధించిన భౌగోళిక, సాంఘిక, రాజకీయ చారిత్రాత్మక విషయములు పాఠకులకు ఆసక్తితోపాటు విజ్ఞాన వికాసములను కలుగజేయును.

శ్రీ శివస్తోత్రాలు : శ్రీపురాణపండ రామమూర్తి. ఆధ్యాత్మ ప్రచార సంఘము, ఆలమూరు తూ. గోదావరిజిల్లా. వెల 25 నయాపైసాలు.

ఇందులో శివాపరాధ క్షమాపణస్తోత్రం, శ్రీ శివపంచాక్షర స్తోత్రం, శ్రీ రుద్రాష్టకం, శ్రీ విశ్వనాథాష్టకం, శివతాండవ స్తోత్రంకలవు. సంస్కృత మూలములతో గ్రంథకర్త తన అనువాదములను పొందుపరచి బహుళోపయుక్తంగా చేశాడు.

శ్రీ వాసుదాసదేశిక స్వామివారి జీవితచరిత్రము : శ్రీమతి తురగా కామాక్షమ్మ. ప్రకాశకులు - శ్రీ తురగా పూర్ణచంద్రరావు, మాచ్యాపురము. వెల రు. 1-0-0.

శ్రీ స్వామివారి చరిత్రము యిందు కడుసులభశైలిలో వ్రాయబడినది. మానవజీవయాత్ర జరుగుచుండుటకు, యిహపరములలో సుఖసౌభాగ్యముల పొందుటకు దివ్యపురుషుల జీవితములు నిరంతరము మార్గదర్శకములు. అట్టి జీవితచరిత్ర పొందుపరచబడిన యీ పుస్తకము బహుళోపయుక్తమగుట వాంఛనీయము.

# సంపాదకీయములు

## ఆహారధాన్యాల ధరలు - చౌక దుకాణాలు

ముఖ్యంగా బియ్యంధరలు నిలకడలేకుండా పెరుగుతున్న సందర్భంలో సరసమైన ధరలకు సామాన్య ప్రజానీకానికి బియ్యం సప్లయి చేసే చౌకదుకాణములను ప్రభుత్వము ఏర్పరచడం ఎంతైనా అవసరం. మద్రాసులో బియ్యంపంపిణీ T. U. C. S. వారు చేయడం అశేష ప్రజానీకానికి సహాయకారిగానున్నది. మద్రాసు ప్రభుత్వము చౌకడిపోలను యింకా తెరపించి బియ్యమును సరసమైన ధరలకు అందజేయుటకు పెట్టడం ముదావహము.

## వెనుకబడిన వర్గాలవారికి సహాయం

వెనుకబడిన వర్గాలవారికి సహాయం ఆర్థికస్తోమతునుబట్టి యుండాలని సమాజ సంక్షేమ కార్యక్రమ పరిశీలక సంఘము సూచనలొసగలదు. దీనిని కొందరు వ్యతిరేకించడం చాలా విచారకరము.

వెనుకబడిన వర్గాలవారైనా ఉన్నతోద్యోగాలలోనుండి, ఆర్థికస్థిమితము ఏర్పడితేకూడ వెనుకబడిన వర్గాల బీదవారలతోబాటు ఉచిత విద్యావసతులు, యితర సహాయము, ఉద్యోగావకాశములు ప్రత్యేకంగా యుండాలనడం సబబనిపించుకోదు.

సమాజ సంక్షేమమనునది దేశం మొత్తానికుద్దేశించినది కాబట్టి అవసరాల కనుగుణంగా యావత్ప్రజానీకము అన్వయించాలి.

## ఆహార సేకరణ

మనదేశంలో స్వయం సమృద్ధమైన ఆహారమును సేకరించి అమర్చుకోడానికి ప్రజలు అలవడలేదు. ఏనాటినుండో అలవాటులోనున్న బియ్యం, జొన్నలు, గోధుమలలాంటి ధాన్యాలవాడకం తప్ప పాలు, పండ్లులాంటి వాని వినియోగం విస్తృతంకాలేదు. వ్యవసాయంతోబాటు పాడిపట్ల శ్రద్ధచూపితే పాలు, వెన్న లాంటి అమూల్యమైన ఆహారం సమకూరుతుంది. పండ్లవాడకం అధికమైతే వివిధకాలాల కనుగుణ్యంగా తోటల్లో, దొడ్లలో, అడవులలో సయితము ఉత్పత్తికాగల ఫలవర్గాలు మేలైన ఆహారమును సమకూరుస్తవి. ఈనాడు మన ఆహారపదార్థములతోబాటు పాలు, పండ్లుకూడ వినియోగించితే ఆరోగ్యము మెరుగైనదిగానుండి పాడి, ఫల ఉత్పత్తి వృద్ధిగాంచగలదు.

---



---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras Ag. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు బ్రహ్మాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తీపిగ యుండి నోటికి రుచిగను యింపుగను నుండును

**8 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై**

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట అనేక దుర్గతుల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించునంతకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

**3 ఔ॥ రు. 3-10    6 ఔ॥ రు. 5-50**

## క్షీరబలా తైలం

స్త్రీలకు బహు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

**6 ఔ॥ల బుడ్డి రు. 3-0**

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింత కారమను ఒక రకము ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఆ కారమును శాస్త్రోక్తరీతిని సరియగు కాలపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక యుండుట నిరాగ చేయుదురు. ఈ కారము వారికి కీడుచేసి అనేక దుష్ఫలితలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

**బుడ్డి రు. 2-0**

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

**బుడ్డి రు. 4-0**

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.**

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు :

**సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు, బెంగుళూరు**

LODHRA PRESS, MADRAS-14.